# ప్రతిబింబములు.

(కథానకములు)

మొక్కపాటి నరసింహశాస్త్రి.

సాహితీ సమితి,

తెనాలి, గుంటూరు.

# అంకితము.

---

కవి, గాయకుఁడు, శాస్త్రజ్ఞుఁడు, వివిధభాషావేత్త

నాకు పరమాప్తుఁడునగు

బ్రహ్మశ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారికి.

‘ నిండుమనంబు నవ్యనవనీతసమానము ’

లక్ష్మి, సుహాత్మ, భిక్షువు అను మూడుకథలూ మొదట భారతీపత్రికాముఖమునను, చిత్తగువు, శిల్పిద్వయము అను రెండు కథలూ సఖి పత్రికాముఖమునను, వెలువడి ఆంధ్రసారస్వతాభిమానుల ఆదరణమునకు పాత్రము లైనవి.

మొ. న. శా.

# విషయములు.

# లక్ష్మి.

"లక్ష్మీ, మనరోజులిలా వెళ్లవలసినదేనా! ఇంతకాలమునుంచి సజీవమై చిగిరించుచున్న ఆశాలతను తెంపవలసినదేనా? లేక నిర్మూలముకూడా చెయ్యవలెనా?"

ఈప్రశ్నకు వచ్చే సమాధానము పైన తనజీవిత మంతా ఆధారపడి ఉన్నట్లు, యవనికవలె నున్న అశ్రు బిందువులచాటునుండి ప్రేమరస ముట్టిపడు చూపుతో, అతిత్వరితముగా వస్తున్న వేడినిట్టూర్పుచేత కదులుచున్న నాసికాపుటములతో, చలిస్తోన్న అధరముతో, ప్రాణము లరచేత పెట్టుకుని, లక్ష్మిపెదవులవైపు తదేకదీక్షగా చూస్తూ ప్రకాశరావత్యాతురతతో కనిపెట్టుకున్నాడు.

ప్రకాశరావిప్పటికి సుమారు పాతిక సంవత్సరములవాఁడు. అతనిజన్మస్థలము కాకినాడ. బ్రాహ్మణవంశమునందు పుట్టినవాఁడు. తలిదండ్రులు మంచి సదాచారసంపన్నులు; వైదికసంపత్తి కలవారు. తమ కున్న స్వల్పాస్తిలోనే ఎవరికేనా అడిగినవాళ్లకు పెట్టడమే కాని దేహీ అని చెయిచాచి ఇంకొకరిని యాచించకుండా నప్రతిగృహీతలని వాడుక పొంది కాలక్షేపము

చేస్తూ ఉండేవారు. ఈనాటి సామాన్య కుటుంబీకుల వలె అనవసరముగా కోర్టులచుట్టూ రిజిస్ట్రారాఫీసుల చుట్టూ తిరగడమూ, ఓపాళ్యాలూ సంపన్నాలూ, ఏమీ లేకుండా, చాలా మర్యాదస్తులు, ఘరానామనుష్యులని పేరుపొందినారు. ఒకరిస్తోటి జోక్యము అనవసరము లేదు. పరులనుచూచి అసహనము లేదు. ఎదటివాళ్లు కష్టము లో ఉన్నారూ అంటే, తమరూ చాలా కష్టాలు అనుభ వించి ఉండడముచేత, వాళ్లకంటెఎక్కువగా తమరూ విచారిస్తూ, మరొకసహాయ మేమీ చేయలేకపోయినా, ధైర్యము కలిగించే జాలిమాటలతో ఎదటివాళ్లు తమక ష్టాలు సగము మరిచిపోయేటట్లు చేస్తూ, అందరికీ స్నే హపాత్రులై పదిమందిచేతా "ఓహో" అనిపించు కుంటూ ఉండేవారు.

వారికి చాలామంది పుట్టిపోయిన తరువాత ఇద్ద రుకొడుకులూ నలుగురుకూతుళ్ళూ మిగిలినారు. పెద్ద కొడుకు బీ. ఏ. ప్యాసయి పిఠాపురంరాజావారి కాలేజీ లో అరవయిరూపాయిలజీతముమీద మేస్టరుగా ఉండే వాడు. తరువాత నలుగురుకూతుళ్ళూ కాపరానికి వెళ్ల కముందే అధీసముతప్పి ఇల్లుపట్టారు. కడసారపువాడు ప్రకాశరావు.

ప్రకాశరావు తల్లిపోలిక. అందుచేత చాలా అదృష్టవంతుఁడని చిన్నప్పటినుంచీ అంతా అంటూ ఉండే వారు. మెరుగుచామనచాయ శరీరకాంతి, దీర్ఘముగాక అలాఅని మరీకురుచగాక ఇంచుక స్థూలమై బలిష్ఠమైన అవయవసౌభాగ్యము; కొంచెము లోతైనను ప్రకాశ వంతములై విశాలములైన నల్లనినేత్రయుగము; దృఢ సంకల్పమును తెలియజేయు గడ్డము, మిక్కిలి జాలియు స్త్రీవిషయమున మార్దవమును సూచించు నిండైన ఎర్ర నిపెదవులు గలిగి, చక్కనివాఁడై, ఒకసారి చూచినవారి కి తిరిగి చూడవలెనను యాశగొలుపుచు, స్నేహపాత్రు డని అందరిచేతా అనిపించుకుంటూ ఉండేవాడు. తలిదం డ్రులవలెనే సున్నితమైన వెన్నవంటి మనసుగలవాడు. భూతదయ సర్వసమత్వము గలవాఁడు. ఏమాట మాట్లా డితే ఎవరిమనసు నొచ్చునో అనుభీతితో బహుజాగ్ర తతో సంచరిస్తూ ఉండేవాఁడు. సహజమైన సౌమ్య స్వ భావమునకుతోడు, ఇంట్లో తనతోబుట్టువుల కష్టము చూచి, నిర్ధనుల దైన్యముచూచి, ప్రపంచమంతా కష్ట మయమై ఉండడము చూచి, ఎప్పుడూ విచారముగా ఉంటూ, కష్టములో ఉన్నవారిని చూచినప్పుడు తనకు చేతనైన సహాయము చేస్తూ ఉండేవాడు. ఇతనిస్వభా

వము గ్రహించ లేనివాఁడైఁ ఇతను చాలాం మితభాషి అం దుచేత గర్విష్ఠి అనుకునేవారు. పైవారిదాకా ఎందుకు; ఇంట్లోవాళ్ళే ఇతనిసంగతి తెలుసుకోలేక వట్టివెర్రివా డనుకునేవారు. తన మనస్సు తను ఇతరులకు విప్పిచెప్పు కోడానికి మొహమాటపడి తమంతట తము తెలుసుకునే వాళ్ళెవళ్ళూ లేక, కష్టసుఖములు చెప్పుకోడానికి తన మనస్సులో కలిసేస్నేహితు లెవ్వరైనా ఉంటే బాగుం డునని ఎప్పుడూ విచారిస్తూ, ఇంత ప్రపంచములోనూ ఏకాకియై ఉండేవాడు. చిన్నప్పటినుంచి ఆటలూ పాటలూ ఎరుగడు. ఎప్పుడూ స్కూలికెళ్ళడమూ, చదు వుకోవడము, సెలవులలో మేనత్తగారింటికో మేనమా మగారింటికో వెళ్ళి పదిహేనురోజులో, ఇరవైరోజులో అక్కడుండి మళ్ళీ ఇంటికి రాస్తూ ఉండడము అలవా టయినది.

౨

రాజోలులో ప్రకాశరావుకి ఒకవేలువిడిచిన మేన మామగారు ఉండేవారు. భమిడిపాటి రామచంద్ర శాస్త్రులుగారని సంపన్నగృహస్థులు పదిమందికలవారు. ఆగ్రామములో ఉండే బ్రాహ్మణ్యము అందర్లోకీ వంశ మర్యాదచేతనైతేనేమి ధనధాన్యసమృద్ధిచేతనైతేనేమి,

రామచంద్రయ్యగారే పెద్ద. సాలుకి పదివేల రూపాయలు భూములవల్ల ఆదాయము. సుమారు ఒక్కలకారానికి వడ్డీవ్యాపారము. ఇంటినిండా ఇంటెడు పిల్లలు. తాలూకా తాలూకా అంతాకూడా గొప్పపలుకుబడి. మాంచి ముచ్చటగా ఉండేది వారిఇల్లు.

ప్రకాశరావు ప్రతిసెలవులలోను తప్పకుండా వారింటికి వెళ్ళుతూ ఉండేవాడు. నిస్సారము, సంతోష విహీనము అయిన ఇతని జీవితములో రాజోలుప్రయాణము మనస్సుకు అతనికి ఎప్పుడూ సంతోషము కలిగిస్తూ ఉండేది. ఎక్కడచూచినా చక్కనితోటలు ఊరినిచేరి మంచి నీటి కాలువ, దానిపక్కనే గోదావరి ; వీటన్నిటితోనూ రాజోలు చాలా అందముగాను వాసయోగ్యముగాను ఉండేది. నీళ్లుచూస్తే ప్రకాశరావుకి అమిత ఆనందము. ఎక్కడేనా కాలవున్నా చెరువున్నా గట్టున కూచుని గంటలతరబడి నీళ్లకేసి చూస్తూ ఉండేవాడు. అందులో అతనికి భావనానుసారమైన బొమ్మలు కనబడుతూ ఉండేవి.

రాజోలు తప్పకుండా వస్తూ ఉండడానికి ప్రబల కారణము, ఇక్కడ కాలవా గోదావరీ ఉండడము ఒకటి. ఇదొక్కటే కాదు. ఇంతకంటె ముఖ్యమైనది ఇంకో

టుంది. రామచంద్రయ్యగారికి నలుగురు కొడుకులూ ఇద్దరు కూతుళ్లూను. ఆడపిల్లలిద్దరిలోనూ పెద్దది లక్ష్మీ దేవి. ప్రకాశంకంటె సుమారు రెండేళ్లుపెద్ద. పిల్లకి నిజంగా సార్థకనామము. సువర్ణచ్ఛాయ, చెంపకుచేరెడు కళ్లు, కొటేరేశినట్లుముక్కు, ముద్దులుకొరే నోరు, విశాలమైన నుదురు, బారెడు జడ, ముత్యాలొలికే గడ్డము, దానిపైన చిన్నపుట్టుమచ్చ, నవ్వుతేబుగ్గలికి సొట్టలు. ఇట్టి బాహ్య స్వరూపానికి తోడు ఆంతరంగికస్వభావముకూడా అట్టిదే. వెన్నవలె కరగు మనసు, ప్రేమపూరితమైన హృదయము.

ఇంక కావలసిన దేమిటి. అయస్కాంతశిల ఇనుముని ఆకర్షించేటట్లు, ప్రకాశరావుని ఆకర్షించేది లక్ష్మీ దేవి. చిన్నప్పటినుంచి ప్రకాశరావుకి లక్ష్మినిచూస్తే ఎంతో ఆనందముగా ఉండేది. కారణ మిదని కాని ఆనందముయొక్క స్వభావమిదనికాని మాత్రము చెప్పడానికి వీలులేదు. చంద్రబింబము కనబడడముతోనే కలువలు వికసించినట్లు లక్ష్మినిచూడడము తోటే ఇతని కళ్ళల్లో ఒకవింత తేజస్సూ సంతోషమూ కనుపించేవి. కారణపరీక్ష అతనెప్పుడూ చెయ్యలేదు. కారణముఏమిటి లోపలినుంచి ఏదో పాలపొంగులా వచ్చేదిసంతోషము. వసం

తము రావడము తోటే కోకిల ఎందుకుపాడాలి, పుష్ప మునుచూడడము తోటేమధుపము ఎందుకుఝుంకారము చెయ్యాలి, సూర్యదర్శనము కావడముతోటే పద్మము ఎందుకు వికసించాలి. కారణము ఉండి ఉండవచ్చును. ఇవన్ని మట్టుకు కారణపరీక్ష చెయ్యకుండానే ఈవికార ములను పొందుతూఉంటాయి. అలాగే ప్రకాశంకూ డాను, రాజోలు రావడముతోనే ఒక్కసారి తనకష్టా లన్నీ మరచిపోయేవాడు. నూతనజన్మ ఎత్తినట్టుగా ఉం డేవాడు. పరమ ఆప్తుల నెవ్వరినో చూచినట్లు ఉండేది అతనికి, ఈచిన్నపిల్లని చూడడముతోనే. పోనీ తనకష్ట సుఖము లేమైనా చెప్పుకునేవాడేమోనంటే అదీలేదు. ఆపిల్లని చూడడముతోనే చిన్నపిల్లవాడైపోయేవాడు. ఇంటిదగ్గర ఉన్నంతకాలము వయసున పసిబాలుడైనా, మనసులో ముదుసలిలా ఉండేవాడు. ఇక్కడకొస్తేనో ఆపిల్లమాట్లాడుతే చాలు, నవ్వుతేచాలు, చూస్తేచా లు, సంతోషము, ఊరికేసంతోషము. సంతోషముతప్ప ఇంకొకటెరుగడిక్కడ—సెలవులాఖరై ఇక్కడనుంచి వెళ్ళే సమయమువచ్చిందీ అంటే మళ్ళీ గుండెచెరువైపో యేది. మహాకష్టము ఏదో అనుభవించబోయేవాడులా ఉండేవాడు.

3

లక్ష్మితోడబుట్టినవాళ్ళూ మేనత్తకొడుకూ నర్సాపురములో చదువుకుంటూ ఉండేవాళ్లు. వారిసంరక్షణకోసము లక్ష్మిమేనత్త వితంతు వాళ్ళదగ్గరుండేది. మేనత్తదగ్గరచనువు గనుక లక్ష్మికూడా తరుచు నర్సాపురములోనే ఉండి ఆడపిల్లల స్కూల్లో చదువుకుంటూ ఉండేది.

ప్రకాశరావు ఎప్పుడూ సెలవు లివ్వగానే ముందు నర్సాపురము వచ్చి అక్కడ నాలుగురోజులు ఉండేవాడు. అక్కడనుంచి అంతాకలిసి రాజోలు స్టీమర్లోనో పడవలోనో వచ్చేవాళ్ళు. ఇంటిదగ్గిరనుంచి తెచ్చిన మిన పరొట్లో త్రోవలోకొనుక్కున్న పకోడీలో కారాబూందో వాళ్ళిద్దరూ ఓమూలకూచుని తింటూ మధ్యమధ్య కాస్త గోదావర్లోవేస్తూ అవి తినడంకోసము వచ్చిన చేపల్నిచూస్తూ ఎప్పుడూఇద్దరూ ఇలా పడవమీద వెడుతోంటే బాగుండు ననుకుంటూ"పడవదరి చేరింది దిగం" డనేటప్పటికి, పడవనీ, పడవ్వాళ్ళని, దిగమన్న వాళ్ళని, తమఖర్మాన్ని, తమర్ని సృష్టించినబ్రహ్మదేవుణ్ణీ, తిడుతూ త్వరగా దిగమని తొందరపెడుతూ ఉన్నవాళ్ళ మీద విసుక్కుంటూ, దిగలేక దిగలేక దిగి, చూపు

మేరనరకూ తిరిగి తిరిగి పడవకేళి చూస్తూ, ఆఖరికి బా ష్పపూరితమైన ఒక్క నిట్టూర్పు విడిచి మౌనము వహించి ఇంటికి చేరేవారు. ఇంటికిచేరడముతోనే, బాలురసహజస్వభావముతో పడవసంగతంతా మరచిపోయి ఆటలు ధోరణ్ణి పడేవారు. తెల్లవారుఝామున నాల్గు గంటలకే లేచి ముందు ఎవరికి మెళుకువవస్తే వారు రెండోవార్ని లేపి, పెద్దనవ్వు నవ్వుతూ అర్థములేని మాటలెన్నో చెప్పుకునేవారు. తరువాత ముఖములు కడుక్కుని, తలలు దువ్వుకుని, నీళ్లోసుకుని, లక్ష్మమ్మే నత్త కలిప్పెడుతోంటే, ఇద్దరూ ఒక్కకంచంలోనే ఆవ కాయేసుకుని పెరుగోసుకుని చద్దన్నము తినేవాళ్లు. ఇంట్లోఉండేపిల్లలంతా వీధులోకెళ్ళి ఇరుగుపొరుగు పిల్ల లతోటి ఆడుకొంటూంటే, లక్ష్మమ్మ ప్రకాశంమట్టుకు ఓమూలకూచుని, ఆద్యంతాలులేని కబుర్లు చెప్పుకునే వారు. ఇలా ప్రకాశరావు ఇక్కడుండే పదిహేనురో జులో నెలరోజులో వీళ్ళిద్దరికీ ఒక్కక్షణములా గడచి పోయేవి.

ఇంకో నాలుగురోజులకు ప్రకాశరావు వెడతా డనగానే ఇద్దరికీ అన్నహితవులు పోయేవి. ఇద్దరూ మూ రెడుపొడుగు ముఖములుచేసుకుని మాటామంతీ లేకుం

డా కంఠపూర్తిఅయి, ప్రపంచమంతా ఇంతటితోటి ఆఖ రవుతుందేమో అన్నట్లు, ఒకళ్లకేశి ఒకళ్లుచూస్తూ కూ చునేవాళ్లు. ఇకను బయల్దేరే రోజున చెప్పనే అక్కర లేదు. ఇద్దరూ ఒకళ్లనొకళ్లు కౌగిలించుకుని రాగాలెట్ట డము; ప్రకాశంవెళ్లడానికి వల్లకాదని కొంతసేపూ, తనుకూడా కాకినాడ వెడతానని కొంతసేపూ, లక్ష్మి యేడ్చేది. ఎలాగయితేనేమి వాళ్లనివిడదీసి లక్ష్మిని లక్ష్మిప్రసన్నముచేసి, ప్రకాశం మళ్లీ కొద్దిరోజుల్లోనే వస్తాడని ధైర్యముచెప్పి, అతనికి దాల్లోకి గాజులుచేసిచ్చి సాగనంపేవారు. ప్రకాశం ఇంటికి వెళ్ళిన వారమురోజు లవరకూ లక్ష్మి తిండితినక, ఏదో పరధ్యానముగాను బెంగగాను, మతిపోయినట్లు తిరుగుతూఉండేది. కాకి నాడలో ప్రకాశరావుకూడా అదేఅవస్థలో ఉండేవాడు.

౪

లక్ష్మిదేవికి మేనత్త ఒకావిడుండేది. ఆవిడ పేరూ నామకరణసమయమందు లక్ష్మిదేవమ్మనే తలి దండ్రులు పెట్టారు. కాని పూర్వాచారాన్ని పట్టి వ్యవ హారికములో అందరూ ఆవిడను లచ్చమ్మనేవారు. లచ్చ మ్మను వాళ్ళవాళ్ళు తలిదండ్రులు చిన్నతనములోనే

పోవడముచేత తమదగ్గరే పెరుగుతోన్న తమమేనల్లు డికే ఇచ్చి వివాహముచేసి తమఇంట్లోనే కూతుర్నీ అల్లుణ్ణీ అట్టే పెట్టుకున్నారు. లచ్చమ్మగారు కాపురము నకు వెళ్ళిన చాలాకాలానికి లేకలేక ఒక్కకొడుకు పుట్టినాడు వెంకట్రామయ్య అతనిపేరు. కొంచెము నలుపు; లోతైనకళ్లు; విశాలమైన నుదురు; కొంచెము పొడుగుముక్కు; అందవికారిగాడు కాని ఎక్కువ చక్కనివాడూ కాడు. పాపము, చిన్నతనములోనే తండ్రి పోయినాడు. అయినా ఏలోటూ లేకుండా, తల్లీ మేన మామలూ అరిచేతులలో పెట్టుకుని అతిగారాబముగా పెంచినారు. వెంకట్రామయ్య చిన్నప్పటినుంచీ స్వతంత్ర మంటే ఏమిటో ఎరుగడు. ఎప్పుడూ ఒకళ్ళమీద ఆధా రపడి ఉండడమే. ఏపనీ చేతయ్యేదికాదు. ఆఖరికి అన్న ము కలుపుకుని తినడమేనా చేతయ్యేది కాదు. అన్ని టికీ వాళ్ళమ్మ ఎంత చెపితే అంత. వీధులో కెడుతోంటే ఏబట్టకట్టుకెళ్ళాలో వాళ్ళమ్మ చెప్పాలి. అన్నము తిం టోంటే ఏమికలుపుకోవాలో అమ్మచెప్పాలి. కట్టుకున్న బట్ట మాసిపోతే చాకలిదానికి వెయ్యమని అమ్మచెప్పా లి. అలాఅని తెలివితేటల కేమీ లోటులేదు. చదువులో మంచి తెలివితేటలే ఉండేవి.

ఇతను లక్ష్మికంటె సుమారు పదిపన్నెండేళ్లు పెద్దఅయినా ఇదో పెద్దతేడా కాదనీ, మేనరికము, అందులో ఒక్కడే మేనల్లుడుండగా పైకెళ్ళడ మెందుకనీ, రెండోదాని కెలాగూ పైసంబంధము తప్పదు, పెద్దదేనా ఇంటిదగ్గరుండి మేనత్తదగ్గర సుఖపడుతుందని ఆలోచించి, లక్ష్మికి పదోఏడు రాగానే వెంకట్రామయ్యకు ఇచ్చి పెళ్ళిచేశారు.

పెళ్ళికి ప్రకాశరావుకూడా వచ్చాడు. లక్ష్మికి ప్రకాశానికీకూడా పెళ్ళంటె మేళాలూ, తాళాలూ, ఊరేగింపులూ, భోజనాలూ అనేకాని అంతకంటె వేరేమీ తెలియదు. తనపెళ్ళికి ప్రకాశంకూడా వచ్చాడని లక్ష్మి బ్రహ్మానంద పడిపోయింది. తనస్నేహితురాలికి పెళ్ళిఅవుతోందిగదా అని, ప్రకాశం సంతోషానికి మేరలేదు. అస్తమానం పెళ్ళికూతురు దగ్గరే కూచోడము పెళ్లికూతురు కదిల్తే కదలడము; నుంచుంటే నుంచోడము. తనకి మామూలుగా లక్ష్మి కంచములో అన్నముపెట్టడములేదని మట్టుకు కొంచెము కోపమొచ్చేది ప్రకాశానికి. ప్రకాశముకూడా పల్లకీలో కూచుంటేనే కాని వల్లకాదని లక్ష్మి పట్టుపడుతోండేది. సంబంధముకూడా కొత్తది కాకపోవడమువల్ల మామూలు

టె, విశేషము బంధువులంతా రావడము, భోగంమే
ము దానితోటీ ఈఅయిదురోజులూ ఎక్కువసరదాగా
ఉందన్నమాటకాని అంతకంటె పెళ్ళని క్రొత్త ఏమీ
లేకపోయింది.

పెళ్ళి అయినతరువాత కూడా లక్ష్మి, ప్రకాశ
ము, మామూలుగా ఒక కంచములోనే భోంచేస్తూ ఒక
మంచముమీదనే పడకుంటూ ఉండేవాళ్ళు. ఏదేనా
కోపమొస్తేమట్టుకు "నీ ఎంగిలితిన"నని లక్ష్మి వేరేకంచ
ములో భోంచేసేది. అప్పుడు ప్రకాశం కొంటెతనానికి
ఏఊరగాయిముక్కో లక్ష్మికంచములో పడేస్తే ఉడు
కుబోత్తనము వచ్చి రాగాలెడుతోండేది.

ఇలా కొంతకాలమయేసరికి లక్ష్మి పుష్పవతియై
కాపరానికి వెళ్లింది. ప్రకాశం యథాప్రకారంగావస్తూ
ఉండేవాడు. కాని, మునుపటికిమల్లే, లక్ష్మి ఎందుచేత
తనకంచంలో భోజనంచెయ్యడంలేదో, తనదగ్గర ఎందు
కు పడుకోడము మానేశిందో మట్టుకు ప్రకాశాని కర్థ
ముకాలేదు. పగలు మునుపట్లాగ కబుర్లూ కథలూ చె
ప్పుకోడానికి లక్ష్మికి ఇంట్లో ఏదో ఒకపని ఉండేది.
రాత్రిళ్లు మొగాళ్ల భోజనాలైన తరువాత ఆడవాళ్ల
తోటి భోంచేస్తూ ఉండేదిలక్ష్మి. ఈలోపున ప్రకాశం

ఏచాపమీాదనో పడుకుని నిద్రపోయేవాడు. తెల్లవారు ఝూమున మెలకువ వచ్చినప్పుడు మామూలుగా లక్ష్మిని లేపుదామంటే, ఎక్కడ పడుకునేదో కనపడే దికాదు. "నువ్వెక్కడపడుకుంటున్నా" వని రెండు మూడుసార్లు అడుగుతే, బుగ్గనో పోటు పొడిచి నవ్వుతూ పరుగెత్తుకు పోయేది. ఈమాత్రం తనడుగుతే చెప్పకూడదా అని ఉడుకుమోత్తనము వచ్చి, "మీాకో డలెక్కడ పడుకుంటోం"దని లక్ష్మి అత్తగార్నే అడిగాడు. ఆవిడ పక్కుననవ్వి, " ఎంత వెర్రివాడవోయి; ఎక్కడ పడుకుంటుంది; మొగుడుదగ్గర దక్షిణపుగదిలో తలుపు బిడాయించుకొని గువ్వలా పడుకుంటుంది" అంది. అదేమిటి! మొగుడుదగ్గర పడుకోడమేమి టను కున్నాడు. పోనీ పడుకుంటేమట్టుకు, తెల్లవారకట్ల తను లేపడానికి వీలులేకుండా తలుపుబిగించుకోడ మెందు కనుకున్నాడు. ఎవర్నేనా అడుగుతే నవ్వుతారేమో అని భయపడి ఊరుకున్నాడు. ఏమనుకుంటే ఏమిలాభము. ప్రకాశానికి ఇవన్నీ చూస్తేవెనుకటి ఉత్సాహము తగ్గింది. ఎలాగో ఎందుచేతనో లక్ష్మి తనకి దూరమైపోయిందని తెలుసుకున్నాడు. ఈసౌఖ్యమేనా లేకుండా చెయ్యాలా దేవుడని విచారించాడు.

చద్దన్నముమాత్రము ఇతను తినేటప్పుడే తినేది లక్ష్మి. ప్రకాశానికి రోజూ స్నానానికి నీళ్లు తోడిచ్చేది. అతనిలాగూ చొక్కా ఉతికి ఆరేస్తోండేది. మధ్యాహ్నము తలదువ్వి జడో ముచ్చటముడో వేస్తోండేది.

౫

ఇలాగు కొన్ని సంవత్సరములు సామాన్యముగా జరిగిపోయినాయి. ఒక శుభవారమునాడు, లక్ష్మిచెల్లెలు రవణమ్మకు పెళ్లయింది. రాజమహేంద్రవరము నుంచి పెళ్లివారు తర్లివచ్చారు. పెళ్లి రెండోనాడు సాయంత్రము ఒకమూలకూచుని లక్ష్మి ఎక్కెక్కి రాగాలెట్టడము మొదలెట్టింది. కారణమేమిటో ప్రకాశానికి గోచరించలేదు. బోగంమేళము, బ్యాండు మేళముతోటి మహావైభవముగా పెళ్లవుతోంటే ఇలా ఎందుకు విచారించా లనుకున్నాడు. తేలు గీలేమన్నా కుట్టిందా అనుకున్నాడు. ఎన్నివిధాల తెలుసుకోవలెనని ప్రయత్నముచేసినా, లక్ష్మి, తనచెయ్యి పట్టుకుని మరింత రాగాలెట్టడమే కాని కారణము చెప్పలేదు. కారణము తెలియకపోయినా తన స్నేహితురాలంత విచారిస్తోంది కదా అని తనకీ కళ్లమ్మట నీళ్లు వచ్చాయి. తనూ ఓగదిలోకూచుని కళ్లమ్మట నీళ్లు కారుస్తూ

లక్ష్మి విచారానికి కారణమేమై ఉంటుందా అని ఆలో చించాడు. చెల్లె లత్తవారింటికి వెడుతోందని విచారి స్తోందేమో ననుకున్నాడు. అంతకంటె ప్రబలమైన కారణమేమీ తోచలేదు. సరే ఇందుకేకదా అనుకుని లక్ష్మి దగ్గరకు వెళ్లి పరామర్శించడము మొదలుపె ట్టాడు. "నాకు తెలిసిందిలే కారణ"మ న్నాడు. "సగ దాగా దానికి పెళ్లి అవుతోంటే, నీకు విచారమెందు" కన్నాడు. "పెళ్లాడి నువ్వేమి కష్టపడుతోన్నా"వ న్నా డు. ఈ వింతపరామర్శ విని, బిక్క మొగముతో, ఏడుపుమాని, చిరునవ్వు నవ్వి, "చాల్లేవోయినీకభుజ్జా నువ్వూ్వను, ఎప్పుడూ ఒకలాగే ఉన్నావు"అని చక్కా పోయింది. ఎప్పుడూ ఒకలాగే ఉండడమేమిటా అను కున్నాడు, పాపము, ప్రకాశం.

పెళ్ళి నాలుగోరోజున ప్రకాశానికి ఎందుచేతనో ఏమీతోచిందికాదు. ఏదో పిచ్చెత్తినట్టుంది. త నారో జున లక్ష్మిని పరామర్శించింది మొదలు, మళ్లీ లక్ష్మి తనకు కనపడలేదు. సాయంకాలము హఠాత్తుగా ఒక సారి కనుపించింది. కనపడగానేపిల్చి, ఓగదిలోకి తీసుకె ళ్ళి, కూచోమన్నాడు. "ఎందుకో చెప్పు, నాకుపనుం" దంది. "పోన్లె నీకంత తొందరపనుండి నాతోటి మాట్లా

డడము ఇష్టములేకపోతే వెళ్ళవచ్చు"నన్నాడు. "అబ్బ, అది కాదోయి! నిజంగానే పనుంది. అదికాకుండా ఎవ ళ్ళైనా వస్తే బాగుండ" దంది లక్ష్మి. "బాగుండకపోవ డానికిందులో నాకేమి తప్పు కనపడడంలేదు. నాకు ప్రపంచములో స్నేహితు లెవ్వరూ లేరు నువ్వొకప్పు. నీకోసంగదా నేనిక్కడికి కొస్తాంట. మునుపటికి మల్లే మాట్లాడడము మానివేశావు. పోనీ కనపడనేనా కన పడకూడదా? నువ్వుకూడా ఇంతదూరమై పోతోంటే నాబ్రతుకెలాగ. నేనిక్కడికి రావడముకూడా నీకు కష్ట ముగా ఉందేమో చెప్పు దాచక. నీకెలా ఇష్టమైతే అలాగే చేస్తాను. నాజీవితమంతా ఇలాకష్టాలతో వెళ్ల వలసిందేను. పాపము, నిన్నుకూడా నిష్కారణము కష్ట పెట్టడము నాకిష్టములేదు. నువ్వు రావద్దంటే మానివే స్తాను. నేనేమీ అనుకోన్లే, ఉన్నసంగతిచెప్పు"అన్నాడు ప్రకాశం.

అనేటప్పటకి లక్ష్మికని శ్చేష్టురాలైంది. మొగము ఎర్రపడ్డది. కళ్లల్లో నీళ్ళు కమ్మాయి, ఒళ్ళు కొంచెము కంపించింది. ఒక్క క్షణము మాట్లాడ కూరుకుని, "ప్ర కాశం, నీకుపదిహేనేళ్ళు వచ్చినా వట్టిఅజ్ఞానుడవు. నువ్వు ఇలాఅనకూడదు. నువ్వు రావడము నాకిష్టము

లేక కాదు. ఏదో పని తొందరమీద ఉండడముచేత కన బడలేదు కాని, అంతకంటె మరేమీ కాదు. నువ్వు రాకపోతే నాకు చాలాకష్టముగా ఉంటుంది ; మనుప టికిమల్లేనే నీతోటి మాట్లాడుతూ కూచోవాలని ఉం టుంది ; కాని ఇప్పుడలా వీలులేదు. నువ్వు ఎప్పుడు వస్తావనీ ఎప్పుడు కష్టబడతాననీ మునుపటికిమల్లేనే కను పెట్టుకుంటున్నాను. నువ్వు వెడితే మునుపటికిమల్లేను- అంతకంటె ఎక్కువగాను- బాధపడుతూ ఉంటాను. ఇలా అన్నానని మట్టుకు మర్రి ఎవ్వరి దగ్గరా అనకు," అని రెండు కన్నీటిచుక్కలు రాల్చి, వంచిన తల ఎత్త కుండా గిరుక్కున తిరిగి చక్కాపోయింది. తన స్నేహి తురాలికి తనమీద దయ పూర్తిగా తప్పలేదుగదా అని సంతోషించాడు ప్రకాశం ; కాని ఆతలవంపెం దుకో, ఆకన్నీళ్లెందుకో మట్టుకు అర్థముకాలేదు. ఆర హస్యము కోరడమెందుకో తెలియలేదు. తమకు మిక్కి లిప్రీతి అయిన వస్తువును సాధారణముగా ఎవ్వరూ బహి రంగపరచరు. ఇప్పుడు జరిగినసంగతి ప్రకాశం ఎవ్వళ్ళ తోటీ చెప్పదలచుకోలేదు. ఇదింకొకళ్లకి సంబంధించి నదికాదు. కాని చెప్పవద్దని ప్రత్యేకము అనడానికి కార ణమేమిటోమట్టుకు తెలియలేదు. "అయినా ఆరోజున

లక్ష్మి మాటలు కొంత వింతగా ఉన్నాయి ఎందుచే తనా " అని ఆలోచిస్తూ గోదావరిగట్టుకు వెళ్ళి కూచు న్నాడు ప్రకాశం.

ఆరోజు చైత్రశుద్ధ త్రయోదశి. వెన్నెల చక్క గా చల్లగా ఉంది. అప్పటికే పైకివచ్చిన చంద్రకిరణములు గోదావరిలో ప్రతిఫలిస్తున్నాయి. చల్లనిగాలి వేస్తోంది. చూపుమేరలో మనుష్యు లెవ్వరూ లేరు. దూరాన్ని ఒక చిన్న నావ నెమ్మదిగా నీటిని చీల్చుకు వెడుతోంది. చిన్నతనపురోజులు జ్ఞాపకమువచ్చాయి. మనసులో ఒక విధమైన సౌమ్యభావముకలిగి ఒళ్ళు ఒకసారి గరిపొడి చింది. గోదావరిలో చిన్నచిన్న అలలు బయలుదేరి, వెన్నెలలో మిలమిల్లాడుతూ సజీవమైఉన్న ఒకపెద్ద పా ములా ఉన్నది. చేపలు జంటలుగా నీటిపైకి ఎగురుతూ పరుగెడుతోన్నాయి. ఆకాశముమీద రెండుపక్షులు ద గ్గరగా ఎగురుతూ కూస్తూ గూటికి కాబోలు బహు తొందరగా వెడుతున్నాయి. దగ్గరలో రెండుకుక్కలు చెలగాటాలాడుతూ ఒకదానిమెడ ఒకటికౌగిలించుకుం టూ తమనీడని పట్టుకోవలెనని ప్రయత్నము చేస్తూ ము ద్దుగా గంతు లేస్తోన్నాయి. వెనుక కాలవగట్టుమీద కాబోలు కూచుని పాడుచున్న పిల్లవానిపాట హాయిగా వాయుతరంగములమీద తన చెవిదగ్గరకు చేరుతోంది.

ఇదంతా చూస్తే ప్రకాశానికి మనసులో ఏదో వర్ణనాతీతములైన భావా లుదయించాయి. ఇదివరకు దుఃఖమయముగా ఉన్న ప్రపంచము ఇప్పుడు హఠాత్తుగా ప్రేమమయముగా కనుపించింది. వాయువులో వింతసౌరభము తోచింది. గోదావరీతరంగాల్లో వింతగానము వినిపించింది. హృదయములో నూత్న భావాలు సముద్ర తరంగాల్లాగ బయలుదేరి ఏదో వింత ఆనందము కలుగ చేసినాయి. కాని దాని స్వభావముమట్టుకు సరిగా తెలియ లేదు.

తనూ లక్ష్మి చిన్నప్పటినుంచీ ఆడినఆటలు, పలికినపలుకులు, ఇప్పుడు కొత్తగా స్ఫురించాయి. పాల పొంగులాగ హఠాత్తుగా లోపలినుంచి పట్టరాని సంతోషము వచ్చింది. చీకట్లోనుంచి పెద్దవెల్తురులో కొక్కసారి వచ్చినట్లు, గుడ్డివాడికి నేత్రావరోధము పోయి మళ్లీ దృష్టివచ్చినట్లు, లక్ష్మికీ తనకీ గల సంబంధము హఠాత్తుగా గోచరమైనది ప్రేమ. తను లక్ష్మిని చిన్నప్పటినుంచి ప్రేమిస్తూనే ఉన్నాడు, అదో వింతకాదు. లక్ష్మికూడా తన్ని చిన్నప్పటినుంచి ప్రేమిస్తోంది. అదీ లక్ష్మిమాటల కర్థము. ఆకన్నీటి బిందువుల భావమిది. తననూత్న భావములకు వ్యాఖ్యాన మిది. ఇది స్ఫురించిన

కొంతసేపటివరకూ దీనివలన కలిగిన ఆనందానికి లోబడి పరవశుడై కొంతసేపున్నాడు. తరువాత ఆ ఆనందసమాధిలోనుంచి లేచి ముందుకర్తవ్యమాలోచించాడు. ఒక క్షణములో అజ్ఞానావస్థలో ఉన్న బాలుడు యౌవనుడుగా మారిపోయాడు. ప్రేమస్వరూపమంతా ఒక్కసారి కళ్లకు కట్టినట్లు కనుపించింది. లక్ష్మికి నాలుగైదు సంవత్సరములక్రితమే వ్యక్తమైన సంగతి ఇప్పటికి తెలిసినదతనికి.

ఈ ఆనందవార్ధిలో అవశుడై ఉండి, ప్రవాహమెక్కడికి తీసుకువెడితే అక్కడికి వెళ్లడమా లేక ప్రవాహాని కెదురీది తనఇష్టమువచ్చినచోటికి వెళ్లడమా అని ఆలోచించాడు. ఏది ఎట్లున్నా ఇక్కడనుంచి వెళ్లిపోయి కొన్నాళ్లు మళ్లీ ఇక్కడకు రాకూడ దనుకున్నాడు. తను వెళ్లిపోయి కొన్నాళ్లు కనపడకుండాఉంటే లక్ష్మి తన్నుమరిచిపోయిసుఖముగా ఉంటుందేమో అనుకున్నాడు. ఆమాత్రం అవకాశము లక్ష్మికి కలుగచెయ్యడమే న్యాయమనుకున్నాడు. లక్ష్మి మరచిపోవచ్చు. ఎందుకు మరచిపోదు. నిక్షేపమల్లే మొగుడున్నాడు. కావలశినంత డబ్బున్నది. ఇల్లు; వాకిలి ; సంసారము. మరచిపోతుందంటే ఆశ్చర్యమేమున్నది. కాలము గొప్ప

వైద్యుడు లాంటిది. అనేక మార్పులు కలిగిస్తుంది. కుదరవనుకున్న మనోవ్యధల ననేకాన్ని కుదురుస్తుంది. కాని తనకుమట్టుకు అటువంటి అదృష్టము పట్టదు. తనేమిచూచుకొని మరచిపోతాడు. తనబాధ యావజ్జీవమూ ఇలా అనుభవించవలశినదే, ఒకళ్లతోటి చెప్పుకోడానికి వీలు లేదు. ఒకళ్లుతీర్చేదికాదు. అనుభవించక తప్పదనుకున్నాడు. ఈ నిశ్చయముతోటే ఇంటికెళ్లాడు. అప్పటికప్పుడే పెళ్లివారి అందరి భోజనాలూ అయినాయి. రాత్రి ఊరేగింపుకి బయల్దేరబోతున్నారు. వెంకట్రామయ్య కనబడి, "ఏమిరా, ప్రకాశం అన్నాని కొచ్చావుగావు, ఇంత పొద్దోయేదాకా ఎక్కడి కెళ్లావు"అన్నాడు. "గోదావరిగట్టున కూచున్నాను. నాకీపూట ఆకలి లేద"న్నాడు ప్రకాశం. "ఆకలి లేకపోవడమేమిటి; కొంచెము మజ్జిగోసుకు తిను. ఇవాళ ఆఖరురోజు, ఊరేగింపు కెడదా," మన్నాడు. "నాకాకలిలేదు. ఊరేగింపుకి రాలే"నని ఒకమూల పడుకున్నాడు, ప్రకాశం. వెంకట్రామయ్యని చూడడముతోటే తనసంకల్పము మరింత దృఢమయినది. మరునాడు మధ్యాహ్నము పెళ్లివారితోటే బయలుదేరి, ప్రకాశం, కాకినాడ చేరాడు.

## ౬

ప్రకాశం ఆసంవత్సరమే మెట్రిక్యులేషను ప్యా సయి కలకత్తా చదువుకి వెళ్లాడు. శలవుల్లో ఇంటికొచ్చే వాడు. కాని రాజోలు మాత్రము వెళ్లేవాడు కాడు. అక్కడిసంగతులు తెలుస్తూనే ఉండేవి. వెంకట్రామయ్య సహవాసదోషముచేతను దుర్వ్యాపార మారంభిం చాడు. దగ్గరనున్న మానేపల్లిలో భోగముదాని నొక దానిని చేరదీశాడు. దానివలలోపడి ఇంటికి రావడమే మానుకున్నాడు. దానికి పెట్టేడబ్బు కింకమేరే లేదు. తల్లి కీసంగతి మొట్టమొదట తెలియలేదు. అస్తమా నమూ చక్కనిబట్టలు వేసుకుని డబ్బు ఖర్చుపెడుతూ తిరుగుతోంటే, ఊరికేనలుగురులోనూ తిరగడము నేర్చు కున్నాడు గదా అని ఒక్కడే పిల్లవాడుగదా అని, ఏమ డుగుతే అది ఇవ్వడము మొదలుపెట్టింది. తల్లికి క్రమే ణా, ఈసంగతి తెలిసింది. "పోనీ చిన్నతనము. కొంచెము జ్ఞానము వస్తేవాడే దాన్లోకొస్తాడు, ఇప్పుడు గట్టిగా చివాట్లెడితే కోపమొచ్చి ఏమి అఘాయిత్యము చేస్తా డో" అని కొడుకు ఆటలు సాగించింది. వ్యవహారము ముదిరింది. తల్లి డబ్బివ్వకపోతే భార్యమెళ్ళో వస్తువులు తీసుకోవలెనని ప్రయత్నముచేశాడు. తల్లి, స్నేహితులు

బంధువులు, ఎంతమంది ఎన్ని చెప్పినావినక ఉంపుడుకత్తె ను విడిచిపెడితే దాని గతేమి కానని అడిగాడు.

లక్ష్మి ఒకరోజున మొగుణ్ణి ఇంటిదగ్గర ఉండ మని బ్రతిమాలింది. "లేకపోతే నేనెందులోనేనా పడిచ స్తానంది" "లోకములో ఎంతమంది చావడము లేదు. అం దులో నువ్వొకత్తె"వన్నాడు.

ఇవన్నీ ప్రకాశానికి తెలిసి చాలా విచారిం చాడు. రత్నములాంటి భార్యను విడిచిపెట్టి భోగముదా ని దగ్గర ఏమిసుఖము ఉన్నదని, ఇల్లూ వాకిలీ గుల్ల చేసు కుంటున్నాడు వెంకట్రామయ్యనుకున్నాడు. లక్ష్మి తన కంటె ఒక ఏడాది చిన్నదైనా బాగుండేది; తనుపెళ్ళాడి సుఖపెడుదునుగదాఅనుకున్నాడు. ఏమయినా రాజోలు మట్టుకు వెళ్ళ లేదు. ఇది కానిపనని వెంకట్రామయ్యపేర ఒక ఉత్తరము మాత్రము వ్రాశాడు.లక్ష్మి అవస్థ ఇలావ స్తుందని కలలోనేనా అనుకోలేదు.లక్ష్మి తన్నెప్పుడేనా తలుచుకుంటుందేమో అనుకున్నాడు. లక్ష్మి ఎంతఅవ స్థపడుతోందో ఎంత విచారిస్తోందో అనుకున్నాడు.

ప్రకాశంమట్టుకు లక్ష్మిని మరచిపోలేదు. అను దినము తలుచుకుంటోండేవాడు. ఇలాఉండగా ప్రకా

శానికి పెళ్లయింది. లక్ష్మి పెళ్లికివస్తే బాగుండు ననుకున్నాడు. కాని రాలేదు. బంధువులంతావచ్చారు లక్ష్మి తప్ప. రాలేదని చాలా నొచ్చుకున్నాడు.

కలకత్తాలో అయిదేళ్లుండి ఎం. ఏ. పరీక్షప్యాసయి, ఇంటికొచ్చాడు. భార్య పెద్దమనిషైంది. కార్యము చేసుకున్నాడు. రాజమహేంద్రవరము కాలేజిలో ఉద్యోగమయింది. అక్కడ తనూ భార్యా ఎంతోముచ్చటగా కాపురము చేస్తున్నారు. భార్యఅంటే అతిప్రేమ. నెత్తినిపెట్టుకుని పూజించేవాడు. ఏవిధాన్నీ పెళ్ళాముమనసు నొవ్వకుండా మెలగుతోండేవాడు; కాని లక్ష్మిని మట్టుకు మరచిపోలేదు. నాడు రవణమ్మ పెళ్ళినించి వచ్చి సుమారు ఆరుసంవత్సరము లైంది. నాటినుంచి నేటివరకూ ఒక్కసారేనా రాజోలు తొక్కిచూడలేదు. లక్ష్మిని కలుసుకోలేదు. ఎంతో విశ్వప్రయత్నముచేసి మనస్సు సమాధానపరచుకొని అక్కడికి వెళ్లడము మానేశాడు.

వెంకట్రామయ్య అప్పులపాలయి శరీరమంతా పాడుచేసుకున్నాడు. చాలా జబ్బుపడి చావుతప్పి కన్ను లొట్టపోయిందన్నట్లు ఎలాగోబ్రతికి జీవచ్ఛవమువలె ఎందుకూ అశక్తుడైఉన్నాడు.

చామర్లకోటలో లక్ష్మి పెద్దన్నగారికి పేరికంపె నీలో పనయింది. అక్కడికోసారి చూడ్డానికొచ్చింది లక్ష్మి. ప్రకాశం పనుండి కాకినాడ వెళుతున్నాడు రాజమహేంద్రవరమునుంచి. చామర్లకోటలో లక్ష్మి అన్నగారు కనబడి దిగుమని బలవంతపెట్టాడు. అప్పటికి లక్ష్మి అక్కడ ఉన్నట్టు ప్రకాశానికి తెలియదు. తీరా గుమ్మము ఎక్కేటప్పుడు తెలిసింది. ఒక్కసారి గుండె కొట్టుకోడము మానేశినట్టుండి, మళ్లీ దడదడకొట్టుకోడము మొదలెట్టింది. అప్పుడు వెనుదీయడానికి వీలు లేకపోయింది. కానున్నది కాకమానదని ముందుకి నడిచాడు.

ప్రకాశరావు మునుపటికంటె లావై పచ్చబడ్డాడు. కళ్లకి జోడూ కోటూ వేసుకుని వచ్చేటప్పటికి లక్ష్మి వాకట్లోనే కూచుంది. కాని ప్రకాశరావుని ఆనమాలు పట్టలేక ఎవరోపరాయివాళ్లనుకుని లోపలికి వెళ్ళింది.

లక్ష్మి మునుపటికంటె నల్లపడ్డది. తల చాలాభాగము నెరిశింది. ముఖముకూడా ఎండగాడ్పు తగిలిన పుష్పములాగ వాడిపోయింది. "లక్ష్మి! పరుగెత్తకు, నన్ను మరిచిపోయావా ఏమిటి" అన్నాడు ప్రకాశం.

అనేటప్పటికి వెనక్కి తిరిగి ప్రకాశాన్ని ఆనమాలుపట్టి, నిశ్చేష్టురాలైంది. కళ్లమ్మట నీళ్లుకమ్మాయి. తలవంచుకొని మాట్లాడలేకపోయింది. ఆమాటా ఈమాటా మాట్లాడి ప్రకాశం ఆరాత్రే వెళ్ళిపోయాడు. నివురుగప్పిన నిప్పువలె ఉన్న తనపూర్వప్రేమంతా ఒక్కసారి జ్వాలగా పైకొచ్చింది. కాలము తననుకున్నట్టుగానే ఈప్రేమ నార్పలేకపోయింది.

మళ్లీ రెండుమూడుసార్లు లక్ష్మినికలుసుకోడము సంభవించినది. మాటలవల్లా చేష్టలవల్లా లక్ష్మి తన్నేమీ మరచిపోలేదని తోచింది. దీనివల్ల తనకి మరింత బాధకలిగింది. ఒకపక్క తనభార్యయెడల తనకుగల అవ్యాజప్రేమ; లక్ష్మియెడల తనకు చిన్నప్పటినుంచి ఎన్నివిధముల ప్రయత్నముచేసినా చల్లారనిప్రేమ ఒకపక్క అతన్ని కలతపెట్టడము మొదలెట్టాయి. లక్ష్మి పొందుకోరుతే తన్ని నమ్ముకున్న భార్య ఏమంటుంది. కాని ఈవింతేమిటి, నిజమైనప్రేమ ఉంటే ఇంకొకరిమీద దృష్టిపోదంటారు పెద్దలు. అలాగైతే తనకి భార్యమీద ప్రేమలేదనా? అలాఅని అతను ఒప్పుకోడు. మళ్లీ ఆపెద్దలే దక్షిణనాయకత్వము ఉత్తమనాయకలక్షణముగా గ్రంథాల్లో వర్ణించారు. దోష

మైతే అలాఎందుకు వర్ణించాలి. ఇటువంటి తర్కము తోటి చాలాదూరము ఆలోచించాడు. భార్యమీద తనకు పరిపూర్ణమైన ప్రేమఉన్నది; కాని భార్యరాక ముందునుంచి ఉన్నది గనుక లక్ష్మిమీదకూడా ప్రేమ ఉన్నది. అందుచేత లక్ష్మికూడా కావాలని నిశ్చయము చేసుకొన్నాడు.

౭

ఇలాఉండగా లక్ష్మి ఋతుశూల ఉన్నదని పిఠాపురంలో దొరసాని చాలా సాధకురాలని అక్కడికి వైద్యాని కొచ్చింది. ఆపరేషన్ చేయించుకుని ఆసుపత్రిలో ఉన్నది. ఇంక రెండురోజులకు వెళ్ళిపోతుందనగా ఒకనాడు మధ్యాహ్నము చూడ్డాని కొచ్చాడు ప్రకాశం. ఇద్దరూ కష్టమూసుఖమూ చాలాసేపు మాట్లాడుకున్నారు. ఇద్దరిమనస్సులలోను ఒక్కటే భావము పైకిరావడానికి కొట్టుకుంటోంది. ఒకళ్లగుండె చప్పుడు ఒకళ్లకు వినబడుతోంది. ఇద్దరూకూడా పైకి చెప్పడానికి భయపడి అల్పసంభాషణతోటి కొంతసేపు కాలక్షేపముచేశారు.

ఆఖరికింక పట్టలేక, ప్రకాశం, లక్ష్మిచెయ్యి పట్టుకుని "లక్ష్మీ! నీతోటి ఒక్కమాట చెప్పవలెనని

ఉన్నది. చాలాకాలమునుంచి అనుకుంటున్నాను గాని అవకాశము చిక్కిందికాదు. చెప్పకుండా ఉందామని విధితోటి పంతముపట్టి ఇన్నాళ్ళూ ఊరుకున్నాను. కాని, నేనే ఓడిపోయాను. నేను చిన్నప్పటినుంచీ నిన్ను ప్రేమిస్తున్నాను. కాని చాలకాలంవరకూ ఆసంగతి తెలుసుకోలేక పోయాను. హఠాత్తుగా రవణమ్మ పెళ్ళిలో తెలుసుకున్నాను. పైగా నువ్వుకూడా నన్ను ప్రేమిస్తోన్నట్లు గ్రహించాను. కాని, కొంతకాలము నేను కనపడకపోతే నువ్వు మరచిపోతావేమో అనుకు న్నాను. నువ్వూ మరవలేదని నాకు తెలుసును. నీవు నాదగ్గర దాచనక్కరలేదు. నేనింక హృదయములో బాధ దాచుకోలేక ఇప్పుడు చెపుతున్నాను. ఇప్పుడేనా నాహృదయము పూర్తిగా విప్పదలచుకోలేదు. అందు లోని అగాధప్రేమ బ్రహ్మకుతప్ప మరొకరికి తెలి యదు; కాని ఇదిమట్టుకు నిశ్చయముగా నమ్ము. అగ్ని సాక్షిగా పెళ్ళాడిన భార్యమీద నాకు ఎంతపూర్తి అయిన పవిత్రమైన ప్రేమఉన్నదో అంతపవిత్రమైన ప్రేమ నీమీదా ఉన్నది. ఇది అసంభవమని కొందరికి తోచవచ్చును. ఇది కేవలము అనుభవైకవేద్యము. అందుచేత లక్ష్మీ! మనరోజు లిలా వెళ్లవలసినదేనా!

ఇంతకాలమునుంచి సజీవమై చిగిరించుచున్న ఆశాల తను తెంపవలసినదేనా లేక నిర్మూలముకూడా చెయ్యవలెనా ?" అన్నాడు గుక్కతిప్పుకోకుండాను.

ఈప్రశ్నకు వచ్చే సమాధానముపైన తనజీవితమంతా ఆధారపడి ఉన్నట్లు, యవనికవలెనున్న అశ్రుబిందువుల చాటునుండి ప్రేమరస ముట్టిపడుచూపుతో అతిత్వరితముగ వస్తున్న వేడినిట్టూర్పుచేత కదలుచున్న నాసికాపుటనులతో, చలిస్తోన్న అధరముతో ప్రాణములరచేత పెట్టుకుని లక్ష్మి పెదవులవైపు తదేకదీక్షగా చూస్తూ ప్రకాశరావు అత్యాతురతతో కనిపెట్టుకున్నాడు.

లక్ష్మి తలవంచుకుని వేడినిట్టూర్పులు విడుస్తూ కన్నులనీరుకారుస్తూ సాంతముగావింది. మొహమంతా ఎర్రపడ్డది. వొళ్లంతా జ్వరమువచ్చినట్లు కాగడము మొదలెట్టింది. కొంతసేపూరుకుని, దీర్ఘనిశ్వాస మొకటి విడిచి, "ప్రకాశం నారహస్యము నువ్వు తెలుసుకున్నానన్నావు నిజమే ఆమాట; నేను దాచను. నీమీద ప్రేమున్నమాట నిజమే నాజీవితములో నిన్ను ప్రేమించినట్లు నేనింకొకర్ని ప్రేమించలేదు. నాభర్తని నేను ప్రేమించానని నీతోటిచెపుతే నన్ను నేనే మోసపుచ్చు

కున్నట్లుంటుంది. ఆయనతోటి నేపడ్డపాట్లన్నీ అన్నీ కావు. నీవు నాకెక్కువగా కావలసినరోజుల్లో నువ్వు కూడాదూరమైపోయావు. దానితోటి నాబాధ మరింత ఎక్కువయింది. ఇప్పుడు ఆయనయినా నాకు ఏలోటూ లేకుండా నన్ను నెత్తిని పెట్టుకుంటున్నారు. పాపము నేను లేనిదే ఒక్కక్షణము ఆయనకు గడవదు. ఆయన జబ్బులో ఆయన్ని అరిచేతిలో పెట్టుకుని చేసినచాకిరీ ఇంతా అంతా కాదు. ప్రేమలేక పోతే ఇంత ఎందుకు చేశావంటావేమో. యావజ్జీవము మేము కలిసి ఉండవలసినటువంటి వాళ్ళము. చిన్నప్పటినుంచి ఒకచోట పెరగడమువల్ల మాకొకవిధమైన స్నేహము ఏర్పడ్డది. స్నేహభావముతప్ప మరొకటిలేదు. అదికాకుండా, తన్ని నమ్ముకున్నవాళ్ళని, అందులో భర్తని, అతనెంతదుర్మార్గుడైనా కష్టములో ఉన్నప్పుడు ఆడది విడిచిపెట్టలేదు. నాకు ఆయనతప్ప ఇంకోదిక్కులేదు. నాకు సగము కాలముగడిచింది. వార్ధక్యచిహ్నములు కూడా కనిపిస్తున్నాయి. నువ్విప్పుడు వేసినప్రశ్న అయిదారు సంవత్సరములక్రితమే అడిగిఉంటే, మారుమాట లేకుండా, లోకానికేనా వెరవకుండా నీతోకూడా భూవలయాంతమువరకూ వచ్చేదాన్నే. ఇప్పుడు కాలాతీతము అయి

పోయింది. ముందు వెనుక లాలోచించే రోజులొచ్చాయి. నీమీాద ప్రేమ తగ్గిందని చెప్పడము లేదుసుమా. అంత కంతకు వృద్ధిలోఉందికాని క్షయములోలేదు ఆప్రేమ. నీకు రత్నములాంటి భార్య ఉన్నది. ముందుముందు పిల్లలుకూడా పుడతారు. అటువంటిసమయములో ఇంకోబండ మెడకి తగిలించుకోడము మంచిదికాదు. నీపురోభివృద్ధికి భంగము వస్తుంది. ఉండు, నామాటకడ్డురాకు. నీకు నీభార్యమీాద ఎంతప్రేమఉన్నదో, నామీాదా అంతప్రేమ ఉందన్నావు. కావచ్చును. మొగాళ్లలో అలా ఉంటుందేమోకాని, స్త్రీకిమట్టుకు అలాక్కాదు. ఆడదెప్పుడూ తనహృదయాన్ని అలాపంచలేదు. అంతేకాకుండా తనప్రియుడు లేశమైనా ఇంకొకరిపై ప్రేమచూపిస్తున్నాడంటే ఆడదిసహించలేదు. నిన్నువదలుకోడం చాలాకష్టముగానే ఉందినాకు.ఇంతబాధపడుతూకూడా నీమేలుకోరి నిన్నుచేతులారా విడిచిపెట్టుకున్నానంటే దాన్నిపట్టి నాప్రేమయొక్క పరిమితి తెలుసుకో. ఆఖరు సంగతింకొకటి, శరీరము ఎప్పుడూ ఒకమోస్తరుగా ఉండదు. ఈవేళనున్నపటుత్వమూ సౌందర్యమూ రేపుండవు. మకరందము పోవడములోనే మళ్లీ పుష్పముదగ్గిరకి తుమ్మెద రాదు. మకరందము ఉన్నదిఅంటే పూవుకొంచెమువాడినా, మధుపము ఝుంకారముచేస్తూ చుట్టూ

తిరుగుతూనే ఉంటుంది. అలాగే మనప్రేమపుష్పము కూడా అనాఘ్రాతమైతే, మనప్రేమ ఎక్కువ శాశ్వతముగా ఉంటుంది. అదిగాక శరీరాన్ని కోరకుండా ఉండేప్రేమే సరియైనప్రేమ నీవు మరోలాగ అనుకోకు. నాబాధను మన్నించి ఇంకెప్పుడూ ఇదితలపెట్టకు. కాని నన్నుమట్టుకు మరచిపోకు," అని హృదయవేదనంతా ఒక్కసారి బాష్పరూపముగా వెడలగక్కింది.

ప్రకాశానికికూడా కళ్లమ్మట నీళ్లువచ్చాయి. ఒక్కమాటు నిశ్చేష్టుడై, ఊరుకున్నాడు. ఆఖరికన్నాడు తలవంచుకుని, "లక్ష్మి! ఈమోస్తరు జవాబువస్తుందని నేను స్వప్నములోకూడా అనుకోలేదు. నీవుచెప్పినదే బాగున్నది. నూత్నప్రపంచానికి నాకళ్ళు తెరిచావు. నీపై ప్రేమా గౌరవమూనాకు ఇప్పుడు వేయిరెట్లెక్కువయినవి. నిన్ను ఎన్నటికీ మరవడము అసంభవము. నాహృదయపద్మములో ఎప్పుడూనిన్ను నిలిపి, నిష్కామమైన ప్రేమ పుష్పములతో నిన్నెప్పుడూఆరాధిస్తాను. నిన్నింత కలతపెట్టినందుకు క్షమించి నాకు శెలవియ్యి నేవెడతాను" అని తలఎత్తుకుని, వెనక్కితిరిగి చూడకుండా, దృఢమైన నడకతో వెళ్ళిపోయాడు ప్రకాశరావు.

అతను దృష్టిపథములోనుంచి వెళ్ళగానే, అతని వైపు చేతులుజాపి, ఒక్కసారి తనల్లోనే పెద్ద రాగా లెట్టింది లక్ష్మి. కొంతసేపటికి శాంతించి, కళ్లుతుడుచుకుని, చెదరిన వెంట్రుకలు సవరించుకుని కూచుంది. సూర్యుడస్తమిస్తోన్నాడు. ఆకాశమంతా వర్ణనాతీతములైన వర్ణములతో చిత్రింపబడిఉంది. ఆకాంతికొంత లక్ష్మిగదిలో కొచ్చి, ఆవిడమొగముమీదబడి, ఒక వింత శోభను తెచ్చింది. నెరసిన తెల్లనితల, సువర్ణచ్ఛాయను పొందింది. కన్నులలో చెప్పనలవి కాని ప్రశాంతము నిలచిఉన్నది. తనసంరక్షణకోస మొచ్చినవదినగారు అప్పుడే గదిలోకివచ్చి అట్టేనిలబడిపోయింది. అంత చక్కదనమూ శాంతమూ ఎప్పుడూ ఎక్కడా చూడలేదని ఇప్పటికీ చెపుతోంటుంది ఆవిడ

# మహాత్రు.

౧

రాజోలుతాలూకాలో దొక్షవర మనే చిన్నగ్రామము ఒకటి ఉన్నది. మాపుమేరవరకు ఎటుచూచినా కొబ్బరితోటలు, మామిడితోటలు, పంపనపనసతోటలు, పనసతోటలు కలిగి ఎక్కడా సూర్యరశ్మి లోపలికి చొరకుండా చల్లగా ఉంటుంది. ఆ తోటలమధ్య ఋషివాటికలవలె దూరదూరముగా చిన్నచిన్న ఇళ్లు. అవి చాలవరకు పాశ్చాత్యనాగరికతా సంపర్కములేని బ్రాహ్మణగృహములు. అందరూ పూర్వాచార పరాయణులు; వేదాధ్యయన సంపన్నులు; ఆంగ్లవిద్యావిముఖులు; సంపన్నగృహస్థులు. ఉదయాన్నే లేచి కాలకృత్యములు తీర్చుకుని, సమీపమునన్నున్న గోదావరిలో స్నాన సంధ్యాద్యనుష్ఠానములు తీర్చుకుని, ఇంటికివచ్చి విభూతిపిండికట్లు ధరించి, నీరుకావిధోవతులు బిళ్లపింజలుపెట్టి కట్టుకుని, వీధి అరుగుమీద కూచుని, పొడుము నూరుకుంటూనో, జందెములు వడుక్కుంటూనో శిష్యులకు పాఠములు చెప్తూతూ ఉంటే, మనము ఇరువదవ శతాబ్దములో ఉన్నసంగతి మరచిపోతాము. ఋషుల

కాలము జ్ఞాపకమువస్తుంది. ప్రపంచకము సంగతంతా ఎలాఉన్నా ఇక్కడ మట్టుకు కాలచక్రము కొన్ని శతాబ్దములనుంచి తిరగడము మానివేసి తుప్పుపట్టినట్టు కనుపిస్తుంది.

అవ్వూళ్లో మాకు దగ్గర బంధువు లున్నారు. వాళ్లు చాలారోజులనుంచి ఒక్కసారి వాళ్లఊరువచ్చి పదిరోజులుండి వెళ్లమని బలవంత పెడుతున్నారు. ఒక్కసారి వెళ్లి చూచివద్దామని బుద్ధిపుట్టింది. అదికాకుండా వేసవికాలములో మావ్వూళ్లో ఎండలు చాలాతీవ్రముగా ఉంటాయి. వైశాఖమాసము వచ్చింది. ఎండలు భరించడానికి శక్యముకాకుండాఉన్నాయి. పగలు నిప్పులు కురుస్తున్నాయి. రాత్రి రెండుజాములవరకు వడగాలి కొడుతోంది. ఇటువంటి సమయములో ఒక్కసారి ద్రాక్షవరము వెళ్లి పది పదిహేనురోజులక్కడ ఉంటే ఈ వేసగి బాధా తగ్గుతుంది, మనవాళ్లను చూచినట్టూ ఉంటుందని, వైశాఖశుద్ధ దశమినాడు బయలుదేరి ద్రాక్షవరము వచ్చాను.

కొంచెం మించుమించుగా, నరకమునుంచి స్వర్గములోకి వచ్చినట్లుగా ఉన్నది. ఎండన్నమాట తెలియడము లేదు. మావాళ్లింటికి నూరుగజములలో వైనతే

యమనే గోదావరిపాయ ఒకటి ప్రవహిస్తూ ఉంటుంది. ఎప్పుడూ దానిపైనుంచివచ్చే చల్లనిగాలి, దాహమైన ప్పుడు, తియ్యని అమృతమువంటి కొబ్బరిబొండములలో నీళ్లు, మధ్యాహ్నము ఫలాహారములు. ఇంక కావలసిన దేమిటి ? కేవలమూ ఇంద్రభోగము అనుభవిస్తున్నాను. సాయంకాలము గోదావరీతీరాన్ని కూచుని పడవవాళ్ల పాటలువింటూ, చల్లనిగాలి అనుభవిస్తూ, నీటిలో చేప ల్నిచూస్తూ, చెట్లపైన పక్షులగానము వింటూ ప్రపంచ మును మరచిపోతూ ఉండేవాడిని.

దొడ్డవరమువచ్చి ఆరుదినము లయినది. ఇక్కడ ఎంతసౌఖ్యముగా ఉన్నా పట్నవాసపు సందడి, క్లబ్బు, టెన్నీసు, పేపర్లూ లేకపోవడము మూలాన్ని రోజులు జరగడము చాలాకష్టముగా ఉన్నది. లేవడము, స్నాన ముచేసి భోజనముచెయ్యడము, నిద్రపోవడము, ఫల హారము చెయ్యడము, షికారు వెళ్లివచ్చి మళ్లీభోజనము చెయ్యడము, నిద్రపోవడము. ఇట్లా ఎన్నాళ్లు గడపగల ము. ఎండలైనా సరే మళ్లీ మాపూరుచేరుదామని బుద్ధి పుట్టింది.

ఆరోజుసాయంకాలము యథాప్రకారముగా గో దావరీతీరానికి షికారు వెళ్లాను. సుమారు ఆరుగంట

లవుతుంది. రేవుదగ్గరగా కూచుని ఏరుదాటడానికి వచ్చే వాళ్లను, పైనుంచివచ్చి దిగిపోయేవాళ్లను చూస్తూ కూచున్నాను.

నేనూ కూర్చున్న పది నిముషములకు సుమారు నలుబదియైదు సంవత్సరములు వయసుగల బ్రాహ్మణు డొకాయనవచ్చాడు. ఆయనను నేనదివర కెప్పుడూ చూడలేదు. ఆగ్రామస్థుడానో కాదో కూడా నాకు తెలియదు. ఎవరో రేవుదాటడానికి వచ్చారనుకున్నాను. కాని ఆయన పడవకువెళ్లలేదు. ఒక్కసారి నావైపు నిదానముగా చూసి నాపక్కను కూచున్నాడు. మనిషి కొంచెము పొడగరి. ఆయెత్తుకి తగ్గలావు. తేజోవంత ములు, విశాలములైన కళ్లు. చక్కనినుదురు. తీర్చిన ముక్కు. నిమ్మపండువంటి శరీరచ్ఛాయ. కొంచెము నెరుపుజూపిన తల. ఒకవింతయైన “శాంతరసమొల్కు బ్రహ్మతేజము.” ఆమనిషిని చూడడముతోనే ప్రతివా ళ్లకు ఒక విధమైన భయభక్తులు కలుగుతాయి.

నేను ఇంగ్లీషు చదువుకున్నవాడినవుటచేత ఆయన నాపక్కను కూచున్నా నేను ఆయనను పలుకరించ లేదు. ఒకక్షణము ఊరుకుని ఆయనే నన్ను పలకరించాడు. మావూరుపేరు మాఇంటిపేరు మొదలైనవన్ని

అడిగాడు. ఇంకా ఏవో ఈసంగతులూ ఆసంగతులూ మాట్లాడుతూ కూచున్నాము.

ప్రదోషకాలము సమీపిస్తున్నది. ఆయనా సంధ్యావందనమునకు లేవవలె ననుకుంటున్నాడు. ఇంతట్లోకే ఎక్కడనుంచో ఒకసన్యాసి ఒకాయన వచ్చాడు. మా వెనుకనుంచి రావడముచేత ఆయన మా ఎదుటకి వచ్చేవరకూ మేము చూడలేదు. మాకు కనపడగానే నాపక్కనున్న బ్రాహ్మణుడు లేచి స్వాములవారికి సాష్టాంగనమస్కారముచేసి ఒకటిరెండు దినములు అక్కడ ఉండి తనగృహమును పావనముచేసి తన్ని ధన్యుడిని కావించమని, కృతాంజలియై సవినయముగా ప్రార్థించాడు. స్వాములవారు ఉండుటకు వీలుపడదనీ, అమలాపురము వెడుతున్నామనీ, ఈసారి మళ్లీ ఆమార్గమునవచ్చినపుడు అక్కడ భిక్ష చేస్తామనీ చెప్పి వారికి నారాయణస్మరణతో శలవిచ్చి రేవుదాటి వెళ్ళిపోయారు.

ఇదంతా నాకు ఆశ్చర్యముగా ఉంది. ఎవరో సన్యాసి కనబడ్డంత మాత్రాన్ని ఈయన ఆయనకు సాష్టాంగపడి తనింటికి రమ్మని అంతప్రాధేయపడడ మెందుకా అనుకున్నాను. సన్యాసి అయినంతమాత్రాన వచ్చిన విశేషమేమి టనుకున్నాను. నేనుమట్టుకు లేచి స్వాములవారికి నమస్కారముపెట్టలేదు.

స్వాములవారు వెళ్ళగానే శాస్త్రిలుగారు నెమ్మదిగా నాదగ్గర కొచ్చారు. సూర్యాస్తమయము అయినది. పశ్చిమదిక్కున ఆకాశము రక్తవర్ణముదాల్చినది. గోదావరీజలము తప్తలోహమువలె మెరుస్తూఉన్నది. ఆధునిక యువకుల హృదయములవలెనే గోదావరి క్రుక్కిపోయి నెమ్మదిగా సముద్రమువైపు వెళుతూ ఉన్నది. మందమారుతము అజ్ఞాతమైన విదేశవార్తల నేవేవో మాచెవిలో ఊదుతూఉన్నది.

నాప్రక్కనున్న బ్రాహ్మణుడు నన్ను సంబోధించి "సన్న్యాసాశ్రమమంటే మీబోటివాళ్ళకు గౌరవము లేదు కాబోలు" నన్నాడు. "గౌరవము లేక నేమిలెండి ప్రతివాళ్ళు సన్న్యాసివేషము వేసికొని తిరిగే ఈరోజులలో ఎవరు అసలైన సన్న్యాసులో తెలిసికోవడము కష్టము. అంతేకాకుండా నిజంగాచూడవస్తే సరియైన సన్న్యాసులు ఈకాలములో లేరేమోనని కూడా నా అనుమానము అన్నాను నిర్లక్ష్యముగాను. "అబ్బాయి! నీవు తొందరపడి ఆలాగ అనకు. హిందూమతము ఉన్నంతకాలము భారతదేశము ఉన్నంతకాలము మహానుభావులు ఉండే తీరుతారు. అటువంటివాళ్ళు ప్రకృతు గానేనా ఉండబట్టే ప్రపంచము ఈమాత్రముగానేనా

...ని. నా స్వానుభవములో ఒక సంగతి చెప్పతాను వినుడు" అన్నాడు.

౨

ఆకాశమున ఎరుపు కాస్తతగ్గి కొంత నలుపుతో మిశ్రమమయి ఉన్నది. గాలికూడా ఇందాకటికంటె గట్టిగా వీస్తూఉన్నది. తూర్పుదిక్కున నిండుచంద్రబింబము కొబ్బరితోటల చాటునుంచితొంగిచూస్తూఉన్నది. ఆకాశము నిర్మలముగా ఉన్నది.

"మాది ఈప్రాంతములోనే ఒకగ్రామము. మా తండ్రి చతుశ్శాస్త్రపండితుడు, సదాచారసంపన్నుడు, భూతదయగలవాడు, అందరి చేతనూ చాలా గౌరవింపబడేవాడు. ఇంట్లో ఎప్పుడూ పదిమందికి తక్కువగాకుండా శిష్యులుండేవారు. చాలాస్థితిపరుడు. అందుచేత ఒకరిని ఆశ్రయించవలసినఅవసరము లేకుండా కాలక్షేపము చేయడానికి వీలుగా ఉండేది. నిత్యమూ గోదావరీస్నానము చేస్తూ, శిష్యులకు పాఠములు చెప్పుకుంటూ, వచ్చిన అతిథులకు సత్కారము చేస్తూ చాలా నిష్ఠగా ఉండేవాడు.

ఆయనకు లేకలేక చిరకాలమునకు నేను పుట్టాను. ఆయనతపస్సు ఫలించి వంశము నిలిచినదని చాలా

సంతోషించాడు. కొడుకులు కలగ్గానే సంతోషించడము లేకపోతే విచారించడమే కాని వాళ్ళవలన ఎంతసుఖము కలుగుతుందో ఎంతకష్టము కలుగుతుందో ఆలోచించే వాళ్ళు ఎవ్వరూ లేరు. అతిగారాబముగా మా తలిదండ్రులచేతులలో నానాటికి పెరిగి పెద్దవాడనయ్యాను.

మాతండ్రిగారే నాకు విద్యాగురువులు. పండ్రెండు సంవత్సరములు వచ్చుసరికే కొంత కావ్యజ్ఞానము కలిగినది. ఎప్పటికైనా తనంతటివాడిని అవుతానని మాతండ్రి సంతోషించాడు. కాని మా అమ్మకుమట్టుకు నాకు ఇంగ్లీషు చెప్పించవలెనని ఉండేది. మాబంధువుల పిల్లలని ఇంగ్లీషు చదువుకునే వాళ్ళను కొంతమందిని చూసినప్పటినుండీ నాకూ ఇంగ్లీషుచదువవలెనని బుద్ధిపుట్టినది. మాతండ్రికి ఇష్టము లేకపోయినా మా తల్లిమాటా నామాటా తీసివేయలేక నన్ను అమలాపురము తీసుకువెళ్ళి అక్కడ ఒకబంధువుల ఇంట ప్రవేశపెట్టి ఇంగ్లీషు చదువు చెప్పించమని వారికి వొప్పజెప్పి వెళ్లాడు. సంస్కృతమువలెనే ఇంగ్లీషుకూడా త్వరగానే వచ్చేది. నాల్గోఫారము వరకూ వచ్చాను.

ఇక్కడ యథేచ్ఛగా ఉండేవాడిని. నన్ను అడిగేవాళ్లూ చేసేవాళ్ళూ లేరు. ఎప్పుడు ఎంత కావలెనంటే

అంతడబ్బూ మాతండ్రి నాకు పంపిస్తూ ఉండేవాఁడు. దానితో స్నేహితులు చాలామంది చేరారు. డబ్బు పుష్కలముగానున్నప్పుడు స్నేహితులకు లోపమేమిటి? అందులోనూ నాదగ్గఱ పరిశీలనాశక్తి కొంత తక్కువ. అందుచేత అన్నిరకములవారూ చాల మంది నాచుట్టూ ఎప్పుడూ ఉంఁడేవారు. పదిమంది చేరిన చోట నియమములూ కట్టుబాట్లూ తక్కువగదా! మిత్రబృందము ఎక్కువైనకొద్దీ విద్యపై శ్రద్ధతగ్గినది. పేకాటలు హెచ్చినవి. సిగరెట్లు కాల్చడము ఫేషననే ఉద్దేశముతో అభ్యాసముచేశాను. అక్కడనుంచి ఒకదానిలోనుంచి ఒకటి దుర్వ్యాపారములలోకి దిగాను.

ఇలాగుండగా నేనుండే ఇంటాయనకు పదహారుసంవత్సరముల వితంతుకూతురు ఒక అమ్మాయి ఉండేది. ఆఅమ్మాయికి నాకూ ఎట్లాగునో సంబంధము కలిసింది. ఆ అమ్మాయికి సుమారు రెండు మూడువేల రూపాయిలవస్తువులు ఉన్నాయి. ఒకనాడు ఆ అమ్మాయిని వస్తువులసహా తీసికొని రాజమహేంద్రవరము చేరాను. సుమారు ఒక సంవత్సరముపాటు అద్వితీయమైన సుఖము అనుభవించాను.

ఇంటిదగ్గిర ఆపిల్ల తలిదండ్రులూ నా తలిదండ్రులూ మాకోసముపడ్డ పరితాపము, మమ్మలని వెతకడానికి చేసినప్రయత్నాలూ చెప్ప శక్యము కాదు. కాని మేముమాత్రము దొరకలేదు. దొంగసుఖములు ఎంతకాలము నిలుస్తవి. ఈశ్వరుడు మమ్ముల్నుచూసి సహించలేక పోయాడు. హఠాత్తుగా ఒకరోజురాత్రి ఆపిల్ల కలరావచ్చి తెల్లవారేసరికి కాలము చేసినది.

నేను అంతవరకూ కష్టము అన్నమాట ఎరగను. చావు ఎప్పుడూ చూడలేదు. నాకు ఉపద్రవమైన భయము వేసినది. మాతలిదండ్రులను పెట్టినకష్టాలకు ఇది ఫలితము అనుకున్నాను. నాపాపఫలము ఇప్పుడే అనుభవిస్తున్నాను. ఆ అమ్మాయిని ఎట్లో దహనముచేయించి కొంచెము దుఃఖము చల్లారినతరువాత ఒకనాడు రాత్రి మాయిల్లు చేరుకుని క్షమించుమని మాతండ్రి పాదములపైని పడ్డాను. నాతండ్రి నన్ను ఇంట్లోకి రావద్దన్నాడు. ఎక్కడ నుంచి వచ్చానో అక్కడికే వెళ్లమన్నాడు. తులసితోటలో గంజాయి మొక్కవలె తమ వంశము పాడుచేయడానికి పుట్టానన్నాడు. బ్రతికి ఉండగా ఎప్పుడూ తనకళ్ళ పడవద్దన్నాడు.

ఆయన అన్నంతమాత్రాన్ని ఎక్కడకుపోను? ఆయన మాటలలో అసత్యము ఏమిఉన్నది? ఆయన

అన్నాడని నాకు కోపమువచ్చిన ప్రయోజనము ఏము న్నది? జరిగినసంగతి అంతా చెప్పాను. ఇకముందు ఎప్పుడూ అటువంటిపని చెయ్యనని చెప్పాను. బుద్ధివచ్చి నదని చెంపలు వాయించు కున్నాను. కన్నకడుపు. పుత్రవియోగము ఎంతకాలము భరింపగలదు? కొడుకు ఎంత దుర్మార్గుడైనా ఏకపుత్రవిషయ మైనప్పుడు అంత్య కాలమున కాసినినీళ్లుపోయడానికి వాడేకదా దిక్కు. నాతండ్రీ పెద్దవాడయ్యాడు. మరి ఎప్పుడూకళ్లకు కన పడడు అనుకొన్నకొడుకువచ్చి కాళ్లుపట్టుకొని ప్రాకు లాడుతూ ఉన్నప్పుడు ఎలా పొమ్మనగలడు. పోతే ఇం క తనకుదిక్కెవరు. ప్రపంచములో ఎందరు దుర్మార్గులు లేరు. ఎంతమంది పశ్చాత్తాపమున బాగుపడలేదు. ఇక ముందు వీడుమాత్రము బాగుపడ కూడదా అనుకొన్నా డు. ఉండమనిగాని పొమ్మనిగాని ఏమీచెప్పకుండా మాట్లాడకుండా మాతండ్రిలోపలకు చక్కాపోయాడు. తలుపుచాటున కళ్లనీళ్లు గుక్కుకుంటూ నిలబడ్డ మాతల్లి వచ్చి నన్ను కౌగిలించుకుని చేరు మనిరాగా లెత్తి లోప లికి తీసుకువెళ్లి తలంటి నీళ్లుపోసి భోజనముపెట్టింది.

3

అప్పటినుంచీ ఎక్కడికీ కదలకుండా పొలమూ బుట్రా చూసుకుంటూ ఇంటి దగ్గరనే ఉండేవాడిని.

మా తండ్రికల్లపడడానికి ఎప్పుడూ భయముగాఉండేది. ఆయన ఎప్పుడూ నాతోటి మాట్లాడేవాడు కాడు.

కొన్నాళ్లకు బ్రహ్మచారీ బెండకాయా ముదర కూడదని ఒకసంబంధము చూసి మావాళ్లు నాకు వివాహము చేశారు. నా పెళ్లికి మండపేటనుంచి ఒక భోగముమేళము వచ్చినది. భోగముమేళము చూడడముతోనే ఇంతకాలమునుంచీ బలవంతముగా అణచిపెట్టిన మనోభావాలన్నీ మళ్లీతలలెత్తినవి. పెళ్లి అయిదు రోజులూ అయ్యేసరికి నాసంకల్పములూ వ్రతాలూ, ధ్యానములూ అన్నీ వెనకపడ్డాయి. మనుగుడుపులు కాగానే మండపేట చేరాను. చేతిలోడబ్బు పూర్తి అయ్యేవరకూ అక్కడ కాలక్షేపము చేశాను. అక్కడనుంచి నెమ్మదిగా రాజమహేంద్రవరము చేరాను. మళ్లీ ఇంటికి వెడితే నాతండ్రి గుమ్మము తొక్కనివ్వడని నాకు తెలుసును. ప్రాణముపోయినా మళ్లీ ఇంటికి వెళ్లకూడ దనుకున్నాను.

రాజమహేంద్రవరములో వెనకటి అవస్థంతా ఒక్కసారి జ్ఞాపకమువచ్చి అక్కడ ఉండడము కష్టము అనిపించింది. అక్కడనుంచి కాకినాడవచ్చాను. చేతిలో ఒక్కదమ్మిడీలేదు. అప్పటికి భోజనముచేసి రెండురోజు

లయినది. ఏమిచేయడానికీ తోచలేదు. ఎప్పుడూ ఎవ్వరినీ దేహీఅని చేయిచాచి అడిగినవాడిని కాను. సత్రవు లోనికివెళ్ళి భోజనము పెట్టుమని అడగడానికి కూడా సిగ్గుగాతోచింది. ఒక షాహుకారు నాశ్రయించి నేను దిక్కులేనివాడనని చెప్పి ఆతనివద్ద ఒక గుమాస్తాగా ప్రవేశించాను.

ఇట్లా కొంతకాలము గడిచినది. షాహుకారు కొడుకునకూ నాకూ చాలాస్నేహము కలసినది. అతడూ కొంత దుర్మార్గత కలవాడని త్వరలోనే తెలిసికొన్నాను. మేమిద్దరమూ కలిసి తిరగడము ఆరంభించాము. ఆకుర్రవాడు పిఠాపురములో ఒకదాసీమనిషితో స్నేహము చేశాడు. అతనితోపాటు నేనూ వీలికఉన్నప్పుడు పిఠాపురము వెళుతూ వస్తూవుండేవాడిని. కొన్నాళ్ళకీసంగతి షాహుకారికి తెలిసి నన్ను ఉద్యోగములో నుంచి తొలగించాడు.

షాహుకారుకొడుకు నాకు రహస్యముగా కొంతడబ్బు ఇచ్చి నన్ను పిఠాపురములో ఉండమని చెప్పాడు. నేను పిఠాపురములో ప్రవేశించాను. కొంతకాలము జరిగేసరికి నాజీవితము అంతా అసహ్యముగా తోచింది. తలిదండ్రులపైన దృష్టిపోయింది. కాని ఇంటికి

పోవడానికి భయమువేసినది. ఏమొఖము పెట్టుకుని మళ్లీ యింటికి వెళ్లెదెము. ఏలాగు తండ్రిఎదుట నిలబడడము. ఆయనతోటి ఏమని చెప్పడము. ఏమిచెప్పితే మాత్రము ఆయన ఏమని నమ్ముతాడు. లేక లేక పుట్టి నందుకు వారి కన్నెదుట ఉండి వారికి సేవచేయడానికి బదులు ఇలా అయిపోయానుకదా అని అట్టె దుఃఖము వచ్చింది. పాదగయలోపడి కుక్కుటేశ్వరస్వామిపాద సన్నిధని ప్రాణములు విడుద్దా మనుకున్నాను. కాని అందుకూ ధైర్యము లేకపోయింది.

అలాగే సాయంత్రమువరకూ కాలక్షేపముచేసి ఏమీతోచక సాయంకాలము అలవాటుచొప్పున నా డాసీ ఇంటికి బయలుదేరాను. త్రోవలో కొన్ని మామిడిపళ్లూ మిఠాయి కొనుక్కుని వెళుతూ ఉన్నాను. దారిలో కోటగుమ్మముదగ్గర రావిచెట్టు ఒకటి ఉన్నది. ఆరావిచెట్టుక్రిందను ఒక సన్యాసి దర్భాసనము వేసుకు నికూర్చున్నాడు. చుట్టూకొందరు బ్రాహ్మణులు కూర్చున్నారు. తదితరులు కొంచెము దూరములో నిలబడ్డారు.

అంతా నిశ్శబ్దముగా ఉన్నది. ఆయన ధ్యానములో ఉన్నారు. కళ్లు తెరచేవరకూ వీరందరూ కనిపెట్టుకుని కూర్చున్నారు. నేనూవెళ్లి ఆయనను చూడడము

తోచే మనసులో ఒకవిధమైన ఆందోళన బయలు దే రినది. నేను ఎక్కడికి వెళ్లవలె ననుకున్నదీ మరచి పో యాను. హృదయములో ఒకవిధమైన భక్తి బయలుదేరిన ది. అలాగే నిశ్చలుడనై ఆయన కేసి చూస్తూనిలబడ్డాను.

కొంతసేపటికి ఆయన కళ్లు తెరిచారు. తెరవగా నే నాకేసి చూశారు. నాకు ఒళ్లు తెలియలేదు. చేతి లో పళ్లూ పాట్లము ఉన్న సంగతి మరచిపోయాను. వా టిని క్రింద జారవిడిచి నమస్కరించాను. ఆయన మంద హాసముతో "నారాయణా!" అన్నారు. కూర్చోమని సంజ్ఞచేశారు. కిందనున్న పళ్లూ, పొట్లమూ తీసికొని అక్క డనే కూర్చున్నాను. అక్కడ ఉన్న బ్రాహ్మణులు స్వా ములవారిని తమ ఇంటికి రమ్మని ప్రార్థించారు. స్వాముల వారు రామన్నారు. క్రమేణా అందరూ శెలవు తీసికొని వెళ్లిపోయారు. నాకుమట్టుకు కదలబుద్ధి అయిందికాదు.

స్వాములవారు నన్ను ఉద్దేశించి 'ఎక్కడికి వెడు తూ ఉన్నావు' అన్నారు. ఏమి చెప్పడానికీ తోచింది కాదు. కాని చేసినపాపము చెప్పితే పోతుందని నాసం గతి అంతా ఒక్కసారి వారితోటి చెప్పాను. నేను చెప్పి నదంతావిని ఆయన నవ్వారు. నవ్వేటప్పటికి నాకు కొంచెము కోపము వచ్చింది. అయినా యీాయనతోటి

చెప్పవలసిన అగత్యమేమి వచ్చింది అనుకున్నాను. నా పళ్ళూ పొట్లమూ పట్టుకుని నేను లేచాను.

"ఏమి, వెళుతూ ఉన్నావా" అన్నారు స్వాములవారు గంభీరముగా. "చిత్తము. శెలవు ఇప్పిస్తే వెళతా"నన్నాను. "మాకు ఫలహారానికి అవన్నీ ఇచ్చి వెళ్ళవలసింది" అన్నారు. కొంచెము సందేహించాను. దగ్గర డబ్బా లేదు. వేరే ఫలములైనా అర్పించకపోతే ఆగ్రహము వస్తుందేమో. స్వాములవారిక నా అంతట నేను ఇవ్వకపోవడము సరిగదా, ఆయన అడిగినప్పుడైతే నా ఇవ్వకపోతే ఈయన కేమి కోపము వస్తుందో అయినా ఈయనకు కోపమువచ్చినప్పటికిన్నీ నన్నేమి చేస్తారు. నవ్వుతూ "మీ కిస్తే నాకేమి ప్రయోజనము" అన్నాను. "ఇచ్చిచూడు తెలుస్తుంది" అన్నారు. "ఏమి తెలుస్తుంది" అన్నాను "ఐనా నీవు ఇచ్చి ఈరాత్రి ఇక్కడ ఉండి చూడు. నీకు ఇష్టము లేకపోతే మళ్ళీ నీ పళ్ళు నీకు ఇస్తా"నన్నారు. సన్యాసి మాటలవల్ల నాకు కొంత ఆశ్చర్యము కలిగింది. ఉండమని లోపలనుండి ఏదో చెపుతూ ఉన్నట్లు వినబడింది. వెళ్ళిపోదామంటే కాలు ముందుకు సాగడము లేదు. అయినా ఈ చిత్రము ఏమిటో చూద్దామని పళ్ళూ పొట్లము ఆయనకు ఇచ్చి ఒక్క నమస్కారముచేసి అక్కడనే కూర్చున్నాను.

తప్ప మరెవ్వరూ లేరు. అతనే పాడుతున్నాడు. ఇంత చక్కగా అతను పాడగలడని రుక్మిణికి తెలియదు. నిశ్చేష్టురాలై సువర్ణప్రతిమవలె నిలబడి సంగీతము విన్నది. జయదేవుని అష్టపది పాడుతున్నాడు. సంగీతముచక్కగా ఆమె శ్రోత్రపుటములలోనుండి ప్రతిరక్తనాళములోనూ ప్రవేశించినది. ఒళ్ళు జలదరించినది. హృదయము చెయ్యేసి కలచినట్లైనది. శరీరము అట్టుడికిన ట్లుడికిపోయినది.

పాట పూర్తి అయినది. పూర్తి అయిన సంగతి ఆమెకు తెలియలేదు. ఒక్క అయిదు నిమిషములకు చైతన్యము వచ్చినది. తనగదికి వెళ్ళవలెనని బయలుదేరినది. కృష్ణమూర్తి పడుకోడానికి పక్కవేసుకొని దీపము తగ్గించి క్షేత్రయపద మొకటి పాడుతూ పడుకున్నాడు. ఇది రుక్మిణికి ఆఖరుదెబ్బ. తలవంచుకొని గాలిలో రావిఆకువలె మేడమెట్లెక్కి తనపడకగది చేరినది. తలుపు తీసి తిన్నగా మంచముదగ్గరకెళ్ళి దానిమీద అడ్డంగా పడి రెండు నిమిషములు వెక్కివెక్కి రాగాలెట్టినది. అప్పటికి తుపాను తగ్గలేదు. కళ్ళు తుడుచుకుని వసారాలోకి వచ్చినది. నిండుచంద్రుడు పక్కన నవ్వుతూ ఎదురుగా కనపడ్డాడు. మధ్యాహ్నము చదివిన తారా

శశాంకులచరిత్ర జ్ఞాపకము వచ్చినది. పాపము అప్పుడు తార ఎంతబాధ పడ్డదో అనుకున్నది. మళ్ళీ గదిలోకి వెళ్ళినది. కట్టుకున్న చీర విడిచి వేరుచీరకట్టుకుని పడుకుందామని అద్దము దగ్గరకెళ్ళి చీరా జాకెట్టూ విడిచి రాత్రికట్టుకొనే చీర పట్టుకు నిలబడ్డది.

వెనుక నొక పర్యాయము ఇలాగే నిలబడడమూ, కృష్ణమూర్తి గదిలో ఉండడమూ జ్ఞప్తికివచ్చినది. ఇప్పుడుకూడా ఉన్నాడేమో. లేదు. ఇప్పుడేకాదూ అతని గదిలో అతను పడుకోవడము చూచివచ్చినది. ఉంటేనా ... ఆరోజు అతను తనశరీరము చూచినాడేమో. మెరుపువలె ఒకఆలోచనతోచినది. అతన్ని పిలిస్తేనో ... ... మళ్ళీ ఆలోచన లేకుండా బట్టైనా కట్టుకోకుండా వసారాలోకి వెళ్ళి కృష్ణమూర్తిని నాలుగు కేకలేసినది. ఎందుకో అనుకొని "వస్తున్నాను" అన్నాడు. మళ్ళీ గదిలోకి వచ్చినది. ముఖము ఎర్రబడ్డది. బుగ్గలమీద చేతులుపెట్టుకుంటే కాలిపోయినాయి. కన్నులలో నీరు నిండుతూంది. పొంగి బిగియబారిన స్తనములను ఒక్కసారి గట్టిగా అదుముకొన్నది. బయట అడుగులచప్పుడు వినబడ్డది. చీర గబగబ కట్టుకుంది. రవిక తొడుక్కోలేదు. కృష్ణమూర్తి గదిదగ్గరకువచ్చాడు.

౧౧

బయటనుంచే "వచ్చావమ్మా, ఎందుకండి" అన్నాడు. "రా లోపలకురా" అన్నది. ఒక అడుగే లోపలపెట్టి "ఏమండి" అన్నాడు మళ్ళీని. "పరవా లేదులే. లోపలకురా. నేను రమ్మంటున్నాను గనుక తప్పులేదు రా" అన్నది. లోపలికి వెళ్ళాడు. "కూర్చో" అన్నది కూచున్నాడు. ఈలాలన ఏమిటి. ఈసంగతి ఏమిటి ఈఅర్ధరాత్రివేళ మన్ని ఎందుకు పిలిచినది. ఆముఖవైఖరి, ఆలజ్జ, ఆకళ్ళల్లో కాంతులూ కొత్తగా ఉన్నాయి. కిందనొక నౌకరైనా మేలుకున్నారేమో, వాళ్ళు ఏమన్నా అనుకుంటారేమోనని అనేక మోస్తరుగా ఆలోచిస్తూ ఏమీతోచక ఏమిచెపుతుందో అని కని పెట్టుకు కూచున్నాడు.

మూడు నిమిషములవరకూ రుక్మిణి ఏమీ మాట్లాడలేదు. తల వంచుకునే కూర్చున్నది. ఒక్కమాటు తలయెత్తి "అయితేనేను లోపలకు వస్తుంటే నీగదిలో సంగీతము వినపడ్డది. ఎవరు పాడుతూంటా నీస్నేహితులెవరేనా వచ్చారాఏమిటి. లేకపోతే గాయకురాలినెవరినేనా తీసుకువచ్చి గానసభ జరిపిస్తున్నావా" అన్నది మందహాసముతో. కృష్ణమూర్తి ఉలిక్కిపడి "ఎవ్వరూ లేరండి. నేనే ఏదోకొక్కిగా కూనురాగము

తీసుకుంటున్నాను" అన్నాడు. ఆశ్చర్యము నభినయిస్తూ "ఆఁ ఏమిటీ నువ్వేనా ఆ పాడుతున్నది. నిమ్మళముగా సానురాగముగా వేమిటి. అదిపాటకాదు. అమృతప్రవాహముకాని. నిజముగా నువ్వేపాడుతుంటు, నీకు సంగీతము వచ్చునని ఎప్పుడు చెప్పేవుకావు. ఏది ఆ గానానురాగము మళ్ళీ ఒక్కమాటు తియ్యి. వినాల నున్నది. ఏమి సందేహిస్తున్నావు. నిద్రవస్తూ ఉన్నదా ఏమిటి" అన్నది. "లేదండీ నిద్రలేదు. కాని నేను బాగా పాడలేను. ఎక్కడా చెప్పుకున్నది కాదు. ఏదో గాలిపాట" అన్నాడు. "పరవాలేదు. పాటయొక్క మంచిచెడ్డలు నిర్ణయించే దాన్ని నేను. కానియ్యి" అన్నది. భయముతో ఆనంద భైరవి కొంచెము సేపు ఆలపించి,

"సాయంకాలే వనాంతే కుసుమిత
సమయే సైకతే చంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికా
మోహనాపాంగమూర్తిమ్
సేవ్యం శృంగారభావై ర్నవరస
భరితైర్గోపకన్యాసహస్రైః
వందేహం రాసకేళీరత మతిసు
భగం వశ్యగోపాలకృష్ణమ్"

అను కృష్ణ కర్ణామృత శ్లోకము చదివి ఊరుకున్నాడు.

పాడేటప్పుడు అతనిముఖము మారిపోయినది. కన్నులు స్థూలదృష్టికి కనుపడనివస్తువును దేనినో చూస్తున్నట్లున్నాయి. ముఖములో వింత ఆనంద ముదయించినది. రుక్మిణి సమ్మోహనాస్త్రము తగిలినదానివలె నిశ్చేష్టురాలై విన్నది. "ఓహో అద్భుతముగా ఉన్నది. కాని శృంగారరసము భక్తిరసములోకి మారినదేమి. అయినా ఇదైనా శృంగారరసముతోటి మిశ్రితమైన భక్తి రసమే. బాగున్నది. కానీయి. మరోటి కానీయి. ఆజయ దేవుని నాగప్పశ్లోకాలు నాపైకి రాకా పదనియ్యి" అన్నది. అప్పటికి మరొక శ్లోకము చదివేశాడు. క్రమేణా మొదటిసందేహమూ బెరుకూ వదలి కొంచెము ధైర్యమువచ్చినది. శ్లోకాలూ, పద్యాలూ, అష్టపదులూ సుమారు కొన్నింటిని పాడాడు.

రుక్మిణి పరవశయై పోయినది. కృష్ణమూర్తి నెప్పుడూ ఇంత పరిశీలనగా చూడలేదు. మనిషికూడా చక్కనివాడే. ఇంక పాటా అద్భుతము. కేవలము దేవగానమే. ఇటువంటిమనిషిని ... ... "పాపము చాలా శ్రమపడ్డావు. కాసిని పాలుపుచ్చుకో. లేకపోతే కాస్త టీ కాచి ఇమ్మన్నావా" అన్నది. "వద్దండి. ఏమీ వద్దండి" అన్నాడు. "అలాగు కాదు. కాసినిపాలు పుచ్చు

కో'' అనితనకోసము అక్కడవున్న పాలు అతనికిచ్చినది. అవి అతను పుచ్చుకుంటూ ఉండగా తనూ కొంచెము రాగ మాలపించి ఒక అష్టపది పాడింది.

" చరణ రణిత మణి నూపురయా
పరిపూరిత సురత వితానమ్
ముఖర విశృంఖల మేఖలయా
సకచగ్రహ చుంబన దానమ్ ... సఖి హే ...
రతిసుఖ సమయ రసాలసయా
దరముకులిత నయనసరోజమ్
నిస్సహ నిపతిత తనులతయా
మధుసూదన ముదితమనోజమ్ ... సఖి హే ...

"ఆహాహా! ఏమిసంగీతమండీ. ఏమిగాత్రమూ, ఏమిసౌకుమార్యము, ఏమిసౌఖ్యము. ప్రాణమునకు ఇంత హాయి నిచ్చేసంగీతము ఎప్పుడూ వినలేదండీ అతిశయోక్తికాదు. ముఖస్తుతికాదు. అమ్మా! ఇటువంటి సంగీతము తమ స్వాధీనములో ఉన్నప్పుడు నాపోటివాడిని పాడమని అదిబాగుందని స్తోత్రము చేస్తూన్నారే" అన్నాడు. "సరే ఒకరినొకరు పొగడు కోవడము అయిపోయినది. కనుక ఒక్కక్షేత్రయపదమేనా పాడు"అన్నది. "అమ్మా! ఇంక నే పాడలేను. మీపాట విన్నతరువాత మళ్లీ నోరె

త్తమమే ఈ ఇంట్లోను! మీకు శ్రమ లేకపోతే మీరే యేమయినా పాడితే సంతోషిస్తాను" అన్నాడు. "ఆలాగా. సంతోషిస్తావా. సరే అయితేను" అని సుమాదు ఒక్కగంటసేపు శృంగారరసప్రధానములైన ప్రబంధకవుల పద్యాలు, శ్లోకాలు, అష్టపదులు శ్రోత్రపేయముగా నినిపించినది.

కృష్ణమూర్తి పరవశు డయినాడు. ఇతని ఆత్మ అంబరవీథిని విహారము చేసినది. నేత్రములు అర్థనిమీలితము లైనాయి. అవయవములు పట్లు తప్పినట్లుగా జార్లపడి కూచున్నాడు. అర్ధరాత్రి. పుచ్చపువ్వులా వెన్నెల. సంపంగి, నైటుక్వీను, పారిజాతము మొదలయిన పుష్పముల దివ్యసౌరభము దూరమున సముద్రపు రొదతప్ప ప్రపంచమంతా నిశ్శబ్దము. ఎదుట అప్సరసవంటి స్త్రీ దేవగానమును వినిపిస్తున్నది. కృష్ణమూర్తికి ఒళ్లు తెలియలేదు. అభ్యాసములేనివాడు ఘాటైనవిస్కీ తాగితే తలకెక్కినట్లు, ఈఅర్ధరాత్రి ఈవెన్నెలలో ఈసంగీతము ఇతని తలకెక్కినది. ముఖము ఎర్రబడ్డది. లలాటమున ఘర్మబిందువులు ముత్యములవలె మెరుస్తున్నాయి. ఆనందపారవశ్యతచేత నేత్రములు అశ్రుపూరితములైనాయి. ఒళ్లు పులకరించినది. హృదయములో నూత్న భావతరం

గములు బయలుదేరినాయి. మనసులో అనరాని ఆలో
చనలు పరుగులెత్తినాయి.

రుక్మిణి పాట నిలుపగానే తనొక అష్టపది పాడి
నాడు.

"స్మరగరలఖండనం మమ శిరసి మండనం
దేహి పదపల్లవ ముదారమ్
జ్వలతి మయి దారుణో మదన కదనానలో
హరతు తదుపాహిత వికారమ్—ప్రియే..."

ఇతనిలో మార్పు రుక్మిణి గ్రహించింది. ఇతనిమనసు
లో ఉన్న ప్రతి ఆలోచన ముఖములో అద్దములో ప్రతి
బింబములాగ కనపడుతూ ఉంది. మనము జయించి నా
మనుకొన్నది. అష్టపది కాగానే క్షేత్రయపద మొకటి
పాడినాడు. సుమారు రెండు గంటలవుతుంది. రుక్మిణి
ఇంక నిలువలేక పోయినది. ఇతనిపాట పూర్తి కాక
ముందే గాలిలో లేడీగలాగ ఊగుతూ కృష్ణమూర్తి
కూచున్న సోఫాదగ్గరకు వచ్చి ఇతని పక్కను కూచుని
ఇతనిని బిగికౌగిట జేర్చిపట్టి నోటిమీదా, కన్నుమీదా
ముఖముమీదా, తలమీదా గబగబ ఒక ఇరవైసార్లు
ముద్దు పెట్టుకొన్నది. ఆవిడ పైట తొలగిపోయినది.
పొంగి బిగియబారిన ఆమె వెచ్చని చన్మొనలు ఇతని

హృదయమును దూసుకు పోయినాయి. గజగజ వణ కుతూ అనశుద్ధై తన చేతులలో ఉన్న కృష్ణునకు స్త్రీ స్పర్శ తగులుట కదే మొదటి సారి అని ఆమె తెలుసు కున్నది.

కృష్ణమూర్తి ఒక్క క్షణామునకు చైతన్యము తెచ్చుకొని ఆమె కౌగిలిప్పు విడిపించుకోవలెనని ప్రయ త్నము చేశాడు. "నన్ను తోసెయ్యకు. నాముద్దుకృష్ణా! భయపడకు. ప్రపంచమంతాగ వెర్రివేషా లెయ్యకు. అలసికున్న నిగ్రహము నీకు లేదు. నీ కేమీ భయము లేదు లే. స్వర్గము దక్కిం కేప్పుడే 'ఇట్టే ఇదికాదు స్వర్గ మంటే' అక్కడినుంచి కిందగా నరకములోనే పడడము. మనము కోరినప్పుడల్లా స్వర్గము రాదు. నిజమైన ఆనం దము మనకు జీవితములో ఎప్పుడోకాని లభించదు. అదృష్టవశాత్తున అది వచ్చినప్పుడు ఆనందము ఇదవునా కాదా అని మీమాంస పడుతూ ఉంటే మనకోసము అది వేచిఉండదు. మర్రి యథాప్రకారస్థితిలోనే ఉం డాము అనుకొని అట్టే సందేహించకు. ముద్దులకృష్ణా! రా" అని కౌగిలి వదలకుండానే మంచము దగ్గరకు లాగినది.

కృష్ణమూర్తికి ఈమె చెప్పినదేమీ వినపడలేదు. ఆమెశరీరము వేడి తన వంటి కెక్కినది. ఆమె వేడి

యూర్పులు తన ముఖమునకు తగులుతున్నాయి. ఆమె శరీరపారభము మత్తు మందువలె ఇతనికి మాంద్యమును కలిగించినది. దానితో అతని బలము పూర్తిగా నశించి నది. కీలుబొమ్మవలె ఆమెపక్కను మంచము మీద కూచున్నాడు. అతని తల ఒక చేత్తో నిమురుతూ రెండో చేత్తో కౌగిలి మరింతబిగించి మరోమారు రుక్మిణి మళ్ళీ ముద్దుపెట్టుకొన్నది. దానితో అతని వెనుకటి స్వరూప మంతా మారిపోయినది. కొత్త ప్రాణమూ, దానితో మళ్ళీ బలమూవచ్చినది. ఒక్కసారి ఒళ్ళంతా పులకరించి నది. కళ్ళు జోతులవలె ప్రకాశించాయి. ప్రవాహము లో మునిగిపోతున్న వాడు చేతికి దొరికినవస్తువును గట్టిగా పట్టుకున్నట్లు రుక్మిణిని తన బలముకొద్ది ఆలింగనము చేసుకొని ఆమెకు ఊపిరాడకుండా నోటిమీద ముద్దుపెట్టు కున్నాడు. ఆకౌగిటిలో పుష్పమువలె ఆమె నలిగిపోతూ "అబ్బా"అని వెనక్కు వాలింది.

ఆ ఉభయులకు ప్రపంచ మంతటితో అంతరించి పోయినది.

౧౨

ఈ రెండుమాసములనుంచీ పడ్డ అవస్థను మరి పించు ఒళ్ళు తెలియని ఆనందములో ఒకవారము గడిచి

నది. వెన్నెలపోయి చీకట్లు అలుముకోవడము మొదలు పెట్టినాయి. ఎల్లకాలమూ శుక్లపక్షము ఎందుకు నిలుస్తుంది. కృష్ణపక్షము వెంటనే రాకమానదు. ఆ అనాలోచితకార్యము చెయ్యడమూ, చెయ్యిదాటి పోయిన తరువాత దాని మంచిచెడ్డలను గురించి ఆలోచనా, తరువాత విచారము.

రుక్మిణికి ఆ ఉద్రేకము ఇప్పటికి కొంచెము తగ్గినది. పొరపాటు చేశామనే జ్ఞానము కలిగినది. అయితే మట్టుకు ఇప్పుడు చేసేదేమున్నది. "ఇంకా నారాయణరావు ఎప్పుడు వస్తాడో వచ్చిన తరువాత తెలిస్తే ఏలాగు, కొంప మునిగిపోతుంది. అయినా ఏలా తెలుస్తుంది ఆయనకు. అన్నట్లు ఈమధ్య ఉత్తరము వచ్చి కూడా చాలాకాలమయినది. ఎందుచేతనో, ఎప్పుడూ తప్పకుండా వ్రాసేవారు, ఈసారి ఇంత ఆలస్యానికి కారణ మేమైయుంటుంది. శరీరములో ఏమీ అస్వస్థగా లేదుగదా కొంపతీసి, నేనూ ఉత్తరము వ్రాసి రెండువారములు కావస్తున్నది. ఏలా ఉన్నారో ఏమిటో అని ఆలోచించి ఒకనాడు ఉదయము తొమ్మిది గంటలకు రుక్మిణి తన గదిలో కూచున్నది. క్రింద కృష్ణమూర్తి భోజనము చేస్తున్నాడు. ఆకాశాన్ని చిరుమబ్బులు ఒకదాన్ని ఒక

టి తరుముకెడుతున్నాయి. ఒక క్షణము నీడగానూ, ఒకక్షణము ఎండగాను ఉంటూఉంది. హఠాత్తుగా వాకట్లో మోటారుచప్పుడు వినవచ్చింది. ఎవరయి ఉంటారా వచ్చినవారని రుక్మిణి ఆలోచిస్తూ కూచున్నది. లేచి ఇవతలికి రాలేదు.

నారాయణరావు కారులోనుంచి దిగి నాలుగడుగులలో మేడమీదకే వెళ్ళి తిన్నగా రుక్మిణి గదిదగ్గర నవ్వుతూ నిలబడ్డాడు. గుమ్మమున కెదురుగా పడకకుర్చీలో కాళ్ళూగిస్తూ వచ్చేవారెవరా అని ఆలోచిస్తూ కూచున్నది రుక్మిణి. భర్తను చూచి నిర్ఘాంత పోయినది. "ఎక్కడ నుంచి ఊడిపడ్డాడు. ఏలా వచ్చాడు. ముందు ఉత్తరము ఎందుకు వ్రాయలేదు. అతని సంగతి అనుకుంటూ ఉండగానే ఈలా ప్రత్యక్షము కావడమేమిటి." అనే ఆలోచనలు గాలిలో మబ్బులు లాగ పరుగులెత్తడము మొదలు పెట్టినాయి. ఈ ఆలోచనలో లేవవలెననీ, అతనికి స్వాగత మివ్వవలెననే సంగతి మరచి పోయినది. నారాయణరావు రెండు అంగలలో ఆమెకుర్చీ దగ్గరకు వచ్చి కుర్చీలో వెల వెల బోతూన్న మనిషిని కౌగిట్లో పట్టుకు లేవనెత్తి ముద్దాడి, "ఏమి రుక్మిణీ' అప్పుడే రెండు మాసములకే నన్నుమర

చి పోయూవా ఏమిటి, లేకపోతే చెప్పకుండా వచ్చి నందుకు కోపమా. అక్కడ పని అనుకున్నకంటె పది హేను రోజులు ముందుగా అయిపోయినది. అందుచేత తక్షణం బయలు దేరినాను. నీకు తెలియపర్చడానికి వ్యవధి లేక పోయినది. కేబుల్ ఇద్దామనుకున్నాను. కాని మళ్ళీ నీకు తెలియకుండా హఠాత్తుగా వస్తేనే సంతోషిస్తావని మనసూ మైలా తీసుకువచ్చినంత త్వరగా వచ్చాను. పొరపాటు చేశా నన్నమాట. నీకు ముందు తెలియపరచ వలసినదే, అయినా ఆ మాత్రము దాని కంతకోప మెందుకూ, ఈ పాటికైనా ప్రసన్నురాలవు కాకూడదూ" అని నారాయణరావు భార్య గడ్డము పట్టుకొని ముఖము పైకెత్తి నుదురు ముద్దు పెట్టుకున్నాడు.

సుశీల బలవంతముగా తప్పించుకొని ఒకింత చిన్నవవ్వు నవ్వి "అబ్బే నాకు కోప మేమిటి, కోప మేమీ లేదు. ఇప్పటికైనా నాయందు దయగలిగి వచ్చినారు. చాలా సంతోషముగా ఉన్నది. ఈ పదిహేను రోజులనుంచి మీదగ్గరనుంచి ఉత్తరము రాకపోయేటప్పటికి ఏమీ తోచడము లేదు. ఏలాఉన్నారా ఏమిటా అనుకుంటూ ఇంకా రానడానికి వీలు లేదని మళ్ళీ ఉత్తరము వ్రాస్తారేమోనని భయపడుతూ ఏమీతోచక

రో జోయుగముగా గడుపుకుంటూ వచ్చినాను. ఇక నుంచి మీా రెక్కడకు వెళ్ళినా ఒక్కరోజేనా నన్ను విడిచిపెట్టి వడితే నేను వప్పుకోను. మీాతో కూడా తీసుకువెళుతూ ఉండండి, అని భర్త మెడచుట్టూ చేతులు వేసుకొని అతని రొమ్ముమీాద తలపెట్టుకొని కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది.

ఇప్పటికి కొంచెము రుక్మిణికి మనసు కుదుటపడ్డది. కాని ప్రేమ పురికొల్పగా రెక్కలమీాద ఎగిరివచ్చిన అమృతమయుని ఎదుట అతనికౌగిట్లో నిలబడ్డప్పుడు తనుచేసిన అపరాధము యొక్క పరిమితి తెలుసుకొన్నది. అగ్నిజ్వాలలమధ్య ఉన్నట్టుగా ఉన్నది. కన్నీరు సముద్రపు పొంగు లా వస్తూఉన్నది. నారాయణరావు తన జేబురుమాలుతో భార్యకన్నీరు తుడిచి ఏడవకు, ఆలాగే ఇకమీా దెప్పుడూ నిన్ను విడిచి వెళ్ళనులే, ఊరుకో. ఇంతబెంగ పెట్టుకుంటావని తోస్తే ఏమైనాసరే మొన్ననుకూడా నాతోటి తీసుకువెళ్ళేవాడనే. ఊరుకో అని ఊరడించాడు.

నౌకర్లు ఇంతలోకే సామాను తీసుకొని పైకి వచ్చినారు. నారాయణరావు బట్టలు విడవడానికి తనగదిలోకివెళ్లినాడు.

౧౩

నారాయణరావు తనగదితలుపు తీసి "మోహినీ వచ్చా..." అతనిమాట పూర్తి కాలేదు. పటముకేసి చూచి నిర్ఘాంతపోయినాడు. పటము అక్కడనే ఉన్నది. పటములో నున్నది మోహిని రూపమే, దానిలో ఏమీ తేడా లేదు. కాని ఆముఖములో మార్పు. ఆనవాలు పట్టడానికి వీలు లేకుండా మారిపోయినది. ఆపటము వేయించి మొదట తను ఊరికి వెళ్లేవరకూ ముఖము ఎప్పుడూ కలకలలాడుతూ ఉండేది. వెళ్ళేరోజునకూడా చిరునవ్వుతో సాగనంపినది. అలాంటి దిప్పుడు ముఖము కళాహీనముగా నున్నది. ఏ దెనిమిది లంకణములు చేసినమనిషివలె చిక్కిపోయి ఉన్నది. కన్నులశ్రుపూరితములయి ఉన్నాయి. ముఖమందు కోపమూ జాలీ కనపడుతూ ఉన్నాయి.

ఇటువంటిమార్పు ఇదివరకు నారాయణరావు ఎప్పుడూ చూచి ఉండలేదు. పటమునందు అటువంటి మార్పు సాధ్యమా అనికూడా అతనికి అనుమానము. ఇదివర కెప్పుడైనా నవ్వుతూ ఉన్నట్టుగాని, ముఖము చిట్లించుకున్నట్టుగాని అత అభిప్రాయమునుబట్టి తనకు ఊరికే అల్లా కనపడే దనుకునేవాడు కాని ఇప్పుడు

మట్టుకు అలా అనుకోడానికి ఏమీ అవకాశము లేదు. ఒకవేళ బొమ్మని ఎవరేనా మార్చి ఉంటారా? మార్చడానికి ఎవరి కేమి అవసరము. బొమ్మను చూచినా అలా మార్చబడినట్లు కనుపించదు. చాలకాలము క్రితము చిత్రించబడినపటమువలెనే ఉన్నది. పైగా ఇక్కడికి వచ్చి ఈపటము పాడుచేయడానికి ఇంకొకళ్ళ కేమి అవసరము. అయితే ఈమార్పుకు కారణ మేమైయుంటుంది. ఎవరిమీద కోపము. ఎవరిమీద జాలి.

బొట్లు విడవకుండానే కాగితము దగ్గరకు వెళ్లి చూచున్నాడు. 'మోహినీ! ఏమిటిది. ఎందు కీకోపము. ఎందు కీలా ముఖము వన్నెతరిగి ఉన్నది. ఎందు కీలా చిక్కిపోయినావు. నేను వెళ్లిపోయానని కోపమా, నీతోటి చెప్పి వెడితినిగా. ఉత్తరము వ్రాయలేదనా నాసంగతులన్నీ నీకు తెలుస్తూనే ఉన్నాయిగా, నువ్వెప్పుడూ నాకు తోడు-నీడుగా ఉంటూనే ఉన్నావుగాదూ, షే-కుత్తర మెందుకు. పోని నావల్ల లోప మేదేనా వస్తే అప్పుడే చెపుతే సహించుకునేవాడిని గాదూ. ఏమి మాట్లాడవు. సమాధానము చెప్పవు. మోహినీ! ఏమిటిది నాకేమీ తోచడము లేదు. నువ్వేదో చెపుతేనేగాని నే నిక్కడనుంచి కదలను" అని అక్కడనే కూచున్నాడు.

ఎంతసేపు కూచుంటేమట్టుకు పటము ఏమి మాట్లాడుతుంది. ఏమీా జవాబురాలేదు. కళ్ళల్లో అశ్రువులు మట్టుకు ఎక్కువయినట్లు కనపడ్డది. సుమారొక గంట అలాగే కదలకుండా ఏమీాతోచకుండా కూచున్నాడు. ఆఖరికి లేచి బట్టలు పిడచి స్నానానికి ఇవతలికి వచ్చినాడు. ఈసంగతి రుక్మిణితోమట్టుకు ఏమీా చెప్పలేదు.

స్నానముచేసి రుక్మిణీ తనూ భోజనమునకు వెళ్ళినారు. భోజనముచేస్తూ అందరియోగక్షేమమూ అడిగి తెలుసుకున్నాడు. "ఏదీ కృష్ణమూర్తి ఏడీ, అప్పుడే భోజనముచేసి కాలేజీకి వెళ్ళేడా ఏమిటి, బాగా చదువుకుంటున్నాడా. అతనికి ఏమీా లోటు లేకుండా కనుక్కుంటున్నావా, అతనికేమైనా డబ్బు గిబ్బు అవసరమయితే ఇచ్చావా, ఏమీా ఇబ్బంది పడలేదుకదా అతను" అన్నాడు రుక్మిణితో.

రుక్మిణి తెల్లబోయినది. "ఇదేమిటి కృష్ణమూర్తిని గురించి ఇంతగా నన్నడుగుతున్నాడు. ఇతనికేమీా అనుమానము లేదుగదా" అనుకున్నది. "అయినా ఇతనికి అనుమానము కలగడానికి ఏమి అవకాశము ఉంటుంది" అని ధైర్యము చెప్పుకొని అతనికి సమాధానము

చెప్పినది. కాని గుండెలలో మట్టుకు ఒకవిధమైన బెదురు ఆరంభమయినది.

౧౪

నారాయణరావు మోహినిపటములో మార్పు చూచినప్పటినుంచీ మనిషి మనిషిలా లేడు. ఒకవిధమైన బెంగ బయలుదేరినది. పటములో మార్పు నిజమే, ఏదో తగినంత గొప్పకారణ ముంటేనేగాని ఇటువంటి మార్పు కలుగదు. అదే నా ప్రతిపటములోనూ ఇటువంటి మార్పులు కలుగవు. తనమోహిని పోయినా ఈపటములో ఇంకా జీవించి ఉన్నది గనుక మామూలువలెనే అవస్థాభేదము లన్నీ ముఖములో కనపడుతున్నాయి. కాని ఇంతమార్పు కలిగించేకారణము ఏమై ఉంటుంది. ఏలాగు తెలుసుకోవడము. మోహినా మౌనముద్రవహించి కూర్చున్నది. ఇంక నీసందేహము తీర్చేవారెవరు. అని అనేకవిధాలుగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. తనపని కూడా సరిగా చూచుకోవడము మానేశాడు.

దీనికి తగినసమాధానము రుక్మిణి ఏమైనా చెప్పుతుందేమో అడిగిచూదామా అనుకున్నాడు. మళ్ళీ ఏమితోచినదో ఆమెదగ్గర ఈసంగతి తలపెట్టలేదు. రుక్మిణిలో కూడా కొంచెము మార్పు కలిగినది. వెనుకటి

ఉత్సాహమూ ఉద్రేకమూ కొంత తగ్గినట్లు కనుపించినవి. మునపటిచురుకు పోయి కొంచెము మాంద్యములో పడ్డది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూన్నట్లుగా పరధ్యాన ముగా ఉండడము మొదలు పెట్టినది. పలకరిస్తే ఉలికిపడి లేనిహాసము తెచ్చిపెట్టుకొని సమాధానము చెపుతూ ఉంటుంది. నాటకాలమీదా సినీమాలమీదా పూర్వపు అభిమానము తగ్గినది. అన్నిటిమాటా అలాఉంచి తన విషయములోకూడా కొంచెము దూరదూరముగా ఉం టున్నది. ఏమిటీచిత్రమంతాను అని ఆలోచిస్తూఉండగా హఠాత్తుగా మనసు కొకఊహ తట్టినది.

కాని దానినిగురించి మళ్ళీ ఆలోచించడానికి భ యపడ్డాడు. తనకే సిగ్గుగా తోచింది. అటువంటి ఆలో చన తనకు తగ దనుకొన్నాడు. ఇంతనీచమైన ఊహ తనకు ఏలాకలిగిందా అనుకున్నాడు. అనేకవిధముల ఆ ఆలోచనను మనసులోనుండి తొలగించవలెనని శా యశక్తులా తంటాలుపడ్డాడు. కాని అదిమట్టుకు తొలగి పోలేదు. ఏది ఆలోచించబోయినా పంతముపట్టినట్లు ఆ ఆలోచనే పైకిరావడము మొదలు పెట్టినది. వద్దను కున్నకొద్దీ ప్రతివిషయము ఆ ఊహను రూఢిచెయ్యడా నికి ప్రయత్నిస్తూ ఉన్నట్టు కనపడ్డది. ఊరినుంచి వచ్చి

నప్పటినుంచీ కృష్ణమూర్తి ఒక్కసారీ కనపడలేదు. ముఖము తప్పిస్తూ ఉన్నట్లు కనపడ్డది. ఆలోచన నిజమే అయియుంటుందా, కాదు. ఒక్కనాటికి కాదు. అయినా ఏమో మోహినిని అడిగిచూదాము. అని తిన్నగా తన గదిలోకి వెళ్ళాడు.

గంభీరమైన ముఖముతో నిశ్చలమైనచూపుతో, దృఢమైన నడకతో మనోనిశ్చయమును సూచించునట్లుగా పెదవులు బిగించి తిన్నగా పటముదగ్గరకు వెళ్ళి నిలబడి "ఏమి మోహినీ! నా ఊహ నిజమేనా ఏమిటి. కొంపతీసి అంతపని జరిగినదా! ఎంతపని! ఎంతద్రోహము చేసినది, నిజమే సందేహ మేమీ లేదూ" అన్నాడు. వేడినిట్టూర్పులు అతిత్వరితముగ వస్తున్నాయి, మోహిని వేరే సమాధానము చెప్ప దేమిటి, కళ్ళమ్మట నీళ్ళు బొటబొట కారుతున్నట్లు వెక్కివెక్కి రాగాలెడుతున్నట్లుగా, నోమ్ము కదులుతున్నట్లు, ఎగుపులు వస్తున్నట్లు నారాయణరావుకు కనపడ్డది. ఆమెచేతులు క్షమాపణ వేడుతున్నట్లుగా జోడించి ఉన్నాయి.

నారాయణరావు నిశ్చేష్టుడై దగ్గరనున్నకుర్చీలో కూలబడ్డాడు. ఒళ్ళు కంపిస్తోంది. మోకాళ్ళమీద మోచేతు లానుకొని అరచేతులలో ముఖము పెట్టుకుని

దుఃఖనిమగ్నుడై కూచున్నాడు. హృదయము ఎండిపోయినది. పొడిగుక్కలు పడ్డాయి. ఒక్కసారి పిల్లవానివలె ఏడిస్తే హృదయభారము కొంతవరకు తగ్గుతుందనుకొన్నాడు. కాని ఒక్కకన్నీటిచుక్కైనా ఎంతప్రయత్నముచేసినా రాలేదు. అలాగే కదలకుండా కొన్నిగంటలసేపు కూచున్నాడు. అప్పటికి కొంచెము దుఃఖభారము తగ్గింది. హృదయము కొంచెము చులకపడ్డది.

౧౨

మోహిని ఇచ్చిన సలహాయే బాగున్నది. తాను ఒకరియందు దోషారోపణచేసి వారిని శిక్షించడానికి తన కేమి అధికారము ఉన్నది.

దూరము ఆలోచించి తనేమీ ఎరగనట్టుగానే ప్రవర్తించడము మొదలు పెట్టాడు. వెనకటికంటెకూడా రుక్మిణియెడల ఎక్కువ దయగా ఉండడము మొదలు పెట్టినాడు. ఒక్క క్షణమైనా బొత్తుగా విడిచిపెట్టు టలేదు. కృష్ణమూర్తిని సెలవులు ఇవ్వడముతోటే తన పని ఏదో చూడుమని కాకినాడ పంపివేసినాడు.

కాని నారాయణరావు దయగా ఉంటున్నకొద్దీ రుక్మిణికి మనోవ్యధ హెచ్చినది. అతను దగ్గరకువచ్చిన కొద్దీ రుక్మిణి దూరముగా ఉండడము మొదలుపెట్టినది.

అతను అమృతవర్షము కురిపించినకొద్దీ రుక్మిణి కృశించి పోవడము మొదలుపెట్టినది. ఏలాగో తనకు తెలియదు కాని నారాయణరావు తన అపరాధము తెలుసుకున్నాడని రుక్మిణి గ్రహించినది. ఏలా తెలుసుకున్నాడు. ఎవరు చెప్పిఉంటారు. ఎవరైనా చెప్పడానికిమట్టుకు ఒక్క భగవంతుడికి తప్ప ఈసంగతి ఇంకొకరికి ఎవరికి తెలుసును. ఏలాగైతేనేమి తెలుసుకున్నవాడు నన్ను తిట్టడమో కొట్టడమో పొమ్మనడమో చేయక ఈనెత్తిమీద పెట్టుకోవడమేమిటి. ఇది మరింత బాధగాఉందే. ఏలాగు. ఏమిదారి. పోసి వెళ్ళి అంతా చెప్పేస్తేనో మనము అనుకున్నట్టుగా ఇదివరకు తెలియకపోతే చెపితే ఏమి కొంపమునుగుతుందో. ఇదివరకే తెలిస్తే ఇప్పుడు మనము చెప్పినందువల్ల వచ్చేలాభమేమిటి.

అంతకంతకు రుక్మిణి మతిపోయినదానివలె ఉన్నది. హృదయములో ఆందోళన హెచ్చినది. ఏమిచేయడానికీ తోచలేదు. నారాయణరావు వచ్చి సుమారు నెలరోజులు కావచ్చినది. ఆనాడు ఆదివారము. రుక్మిణి తనగదిలోఉన్నది. నారాయణరావు గదిలో అతను ఏదో పనిచేసుకుంటూన్నాడు. సాయంకాలము సుమారు నాలుగుగంటలవుతుంది, ఆకాశమున కారుమబ్బు

లు కమ్మినాయి. ఉరుములూ మెరుపులూను రుక్మిణి హృదయములో బాధసహింప శక్యముకాకుండా ఉన్న ది. ఈఅవస్థ ఏలాగో ఓలాగ అంతమొందిస్తేనే గాని బ్రతుకు దుర్లభమనుకున్నది. ఏలాగ అంత మొందించడము. తను ప్రాణహత్య అయినా చేసుకో వలె. లేకపోతే అతని కాళ్ళమీదపడి జరిగినదంతా చెప్పి రక్షించమనేనా వేడుకోవలె. ఇప్పు డతను క్ష మించలేదు అని కాదు. కాని అతని నోటంట ఆమా ట వస్తే ఈహృదయవేదన తీరుతుందేమో ఆలాచెప్పే స్తే కృష్ణమూర్తికి ఏమి నష్టము కలుగుతుందో. పోనీ ప్రాణత్యాగముచేసుకుందాము అంటే ఇంత చిన్న వయస్సులో ఎర సంతైయినా నిండలేదు. ఇటువంటిభర్త ను విడిచిపెట్టి ఈ ప్రపంచాన్ని విడిచిపెట్టి ఏలాగు పోవ డము. పోతేమట్టుకుముక్తి ఉంటుందా. ఈశ్వరుని ఎదట నిలబడి సమాధానము చెప్పుకో నక్కరలేదూ, మాన లాంటి మనిషిదగ్గరనే ఈలా జడిసేటప్పుడు ఇంతదోషము తో ఈశ్వరుని దగ్గర ఏలానిలబడడము. అయినా చేసిన దానికిఫల మెక్కడో ఒకచోట అనుభవించవలెకదా. ఈఅనుభవమిప్పుడు తప్పించుకుంటే ముందు తప్పుతుంద న్నమా టేమిటి. కర్మచేసేటప్పుడు ఉండే ధైర్యము దాని

ఫల మనుభవించేటప్పుడు ఉండనక్కర లేదూ, ప్రాణ త్యాగము చేసుకోవడము వట్టిపిరికిపని. అది తప్పు. వెళ్లి ఆయనకాళ్ళమీదే పడతాను. నాయందు ఇంతదయగా ఉన్నవాడు కృష్ణమూర్తిని మళ్ళీ శిక్షిస్తాడా, పాపము! అతనిని ఇందులోకి దింపినదాన్ని నేనేకదా. ఆసంగతిస్పష్టముగా నారాయణరావుతో చెపితే అతనియెడల మట్టుకు దాక్షిణ్యము వహించకపోతాడా అని చాలా దూరము ఆలోచించి చెంగున లేచి నారాయణరావు గది గుమ్మము దగ్గరకు వెళ్లినది.

అక్కడకు వెళ్ళేటప్పటికి మొదటనున్న ధైర్యము స్వేదరూపమున నీరై స్రవించి పోయినది. ఒళ్ళంతా బలువు ఎక్కిపోయినది. అడుగు ముందుకి సాగలేదు. బయట ఉరుములూ మెరుపులూ ఎక్కువయినాయి. పెద్ద సుడిగాలి బయలుదేరినది. ఒక్కక్షణము మళ్ళీ తటపటాయించినది. కాని ఆఖరికి తెగించి ఒక్కఅంగలో వెక్కివెక్కి రాగాలెడుతూ వ్రాసుకుంటున్న నారాయణరావు కాళ్ళపైన పడ్డది. ఇదేమని నారాయణరావు భార్యను బలవంతాన లేవదీసి ఒడిలో కూచోపెట్టుకుని కన్నీరుతుడిచి దుఃఖహేతు వేమిటని అడిగినాడు.

రుక్మిణికి నోట మాటరాక పొంగిపొరలి వస్తున్న దుఃఖమును ఆపుకోలేక ఒక పది నిమిషములు అతని రొమ్ముమీద తలపెట్టి ఏడ్చి తుదకు తను చెప్పదలచు కొన్న దంతా ఎగుపులతో చెప్పి తనను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టేసెయ్య వలసినదని, అతని సన్నిధియందు నుంచోడానికి కూడా యోగ్యత లేదని ఏదో ఒక విధ మైన శిక్షవిధిస్తేనే కాని ఈబాధ సహించలేనని, ప్రాధే యపడ్డది.

నారాయణరావు నిదానముగా ఆమె నొకసారి చూచి తల నిమురుతూ "ఈపశ్చాత్తాపముకంటె వేరు శిక్ష ఏమికావాలి. ఇదంతా మరచిపో. నూతన జీవిత మారంభిద్దాము" అన్నాడు.

తుపాను తొలగి పోయినది. ఆకాశము నిర్మల మయినది. అస్తమిస్తున్న సూర్యుడు గాఢాలింగనమున బద్ధులైన ఈదంపతులను చూచి దొంగతనము చేసిన వానివలె సిగ్గుచేత ఎర్రవారిన ముఖముతో పశ్చిమాద్రి వెనుక దాక్కున్నాడు.

౧౩

నాడు నారాయణరావు విదేశమునుంచి తిరిగి వచ్చినరోజు మొదలు కృష్ణమూర్తి నారాయణరావు

గారి ముఖము తప్పించుకు తిరిగేడు. వెనుకటి చనువుతో ఆయన దగ్గరకు వెళ్ళడము మానివేసినాడు. తను వారి యెడల ఒనర్చిన అపరాధముయొక్క పరిమితి తెలుసు కొని సిగ్గుపడిపోయినాడు. ఇంత మహోపకారము తన కు చేసినందుకు ప్రత్యుపకారముగా ఇంత నీచకృత్యము చేశాముగదా అని విచారించినాడు. కాలేజీకి వెళ్లేవా డన్న మాటేగాని అక్కడ గురువులు చెప్పే దేదీ తల కెక్కేదికాదు. ఇంటికి వస్తే పుస్తకము చేతపట్ట బుద్ధి అయ్యేదికాదు. భోజనము దగ్గరకువెడితే అన్నము తిన బుద్ధి అయ్యేదికాదు. రాత్రి పంటుకుంటే కంటికి కునుకు వచ్చేది కాదు.

ఈఅవస్తలో ఉండగా కాలేజీకి వేసంగిసెలవులు ఇచ్చారు. ఇంటికి వెళ్ళడమా మానడమా. ఇంటికి వెళ్ళ డానికిడబ్బో. ఇన్నాళ్ళు ముఖము తప్పించి నారాయణరా వుగారి ఎదుట ఏలాపడడము. ఇంటిదగ్గర "నీకంత అప్పు లెవరున్నారు వెళ్ళి ఏమిచేస్తావు" అని అడుగుతే ఏమి సమాధానము చెప్పేది. అని సెలవులిచ్చేనాడు రాత్రి పడుకుని ఆలోచిస్తూ పక్కమీాద దొర్లడ మారంభించి నాడు.

మరునాడు ఉదయాన్ని నారాయణరావుగారు అతన్ని పిలిచి కొంతసొమ్మిచ్చి కాకినాడవెళ్లి వారి పనులేవో చూచిరమ్మని పురమాయించారు. కృష్ణమూర్తి గజగజలాడుతూ తలవంచుకుని నిలబడ్డాడు. నారాయణరావుకు తన సంగతి తెలుసునని ఓమోస్తరుగా గ్రహించుకున్నాడు. అక్కడ నిలబడ్డంతసేపు ఆయన చూపు లాగ్నేయాస్త్రముల వలె నిలువల్లా దహించేస్తూన్నట్టు ఉన్నాయి. కాని ఆయన మాటలయందు మార్దవముగాని ముఖమునందు హాసముకాని తగ్గలేదు.

వారివద్ద సెలవుదీసుకుని మళ్ళీ నారాయణరావుగారికి కనబడకుండా ఆసాయంకాలమే బయలుదేరి కాకినాడ వెళ్ళిపోయినాడు. మద్రాసు విడిచి పూర్వపు స్నేహితుల మధ్యకు వచ్చినా నారాయణరావు గారికి తెలిసిందేమో ఏమి చేస్తారో అనే భీతిమట్టుకు వదలలేదు. మనోవ్యధ అనేకవిధముల బాధిస్తోన్నది. పోనీ ఈసంగతంతా వారికి ఉత్తరము వ్రాసేదా మనుకున్నాడు. అలా వ్రాస్తే రుక్మిణిసంగతి ఏమికాను. వారి సంసారము ఇంతటితో ఛిద్రమయిపోతుందేమో. దానికి కారణము మనమెందుకు కావలెనని కొన్నాళ్ళు ఊరుకున్నాడు. కాని మనోవేదన పిశాచమువలె వెన్నంటి

పీడిస్తూనే ఉన్నది. దుస్సహమైన ఈ బాధనుండి తప్పించుకోడానికి ఒక్కటే మార్గము. ఏమైనా ఆపనిచేసి తీర వలసినదే. లేకపోతే జీవితము దుర్భరమౌతున్నది.

మరునాడు జరిగిన సంగతంతా వ్రాసి ఇక తనెప్పుడూ చెన్నపట్నము రాననీ, ఈఅపరాధము మన్నించమనీ, తన భావిజీవితమంతా వారి క్షమాపణపై ఆధారపడి యున్నదనీ, ఒకపెద్ద ఉత్తరము నారాయణరావుగారి పేర వ్రాశాడు. ఆ తనిల్లా వ్రాసినట్టు ఆమెకూడా ఆయన పాదములపైన పడితే కొంతపాపపరిహార మౌతుందని ఆమె రహస్యమును బయలు పెట్టినందుకు క్షమింపుమని రుక్మిణి పేరకూడా వ్రాశాడు.

౧౭

ఈ రెండు ఉత్తరములు రుక్మిణి నారాయణరావుతో మాట్లాడిన మర్నాడు వచ్చినాయి. రుక్మిణి తన ఉత్తరము తీసుకువెళ్ళి నారాయణరావుకు చూపించినది. నారాయణరావు తనకు వచ్చిన ఉత్తరము ఆమెకు చూపించినాడు. రుక్మిణి అది చదువుతుండగా గతమంతా మళ్ళీ ఒకసారి అద్దములోవలె కనుపించినది. తల వంచుకున్నది. కన్నీటికాల్వలు ప్రవహిస్తున్నాయి. నారాయణరావు రెండు ఉత్తరములూ తీసుకుని నిప్పు

పుల్ల వెలిగించి అంటించేశాడు. "రుక్మిణీ! దీనితో గత మంతా నశించిపోయినది. ఇంక నెప్పుడూ అసంగతి తలపెట్టకు" అని ఆమెకన్నీరు తుడిచినాడు.

## ౧౫

ఇంకొక రెండురోజులకు బి. ఏ. పరీక్షలు తెలిసి నాయి. కృష్ణమూర్తి ప్యాసుఅయినాడు. నారాయణ రావు కృష్ణమూర్తికి ప్యాసుఅయినట్టు టెలిగ్రాముఇచ్చి అతనితండ్రి ఇదివరలో చేసే పనిని అతనిని చూస్తూ ఉండమనిన్నీ, కాన్వొకేషనుకు తప్పక రావలసినదనీ ఒక ఉత్తరముకూడా వ్రాసినాడు.

ఉత్తరము వ్రాయడము ముగించడముతోనే నారాయణరావుకు ఒక పెద్ద నిట్టూర్పు వినపడ్డది. ఎవ రా అని తిరిగి చూచేసరికి ఎవ్వరూ గదిలో కనుపించ లేదు. పైన చూచేసరికి మోహిని చిరునవ్వుతో నిజ స్వరూపముతో కనుపించినది. "మోహినీ! అయితే నేను చేసినపని నీకు నచ్చినదన్నమాటే" అన్నాడు. మోహిని నవ్వి నారాయణరావును కళ్ళతో ఆశీర్వ దించినది.

# శిల్పిద్వయము.

౧

వారిద్దరూ స్నేహితులు. స్నేహితు లంటే లోకములో అనుకొన్నట్టు కాదు. కవలపిల్లలస్నేహము వంటిది వారిస్నేహము. అంతకంటేకూడా ఎక్కువదేమో. స్నేహమంటే ఇద్దరువ్యక్తులకు అని తోచకమానదు. ఇక్కడ వారిద్దరికీ శరీరములు భిన్నములయినా ఆత్మమట్టుకు ఒక్కటే. అర్ధనారీశ్వరావతారముతో ఉపమిస్తే వారిస్నేహస్వరూపము తెలుస్తుంది. ఒకరు దగ్గరలేనప్పుడు ఆలోటు రెండోవారిలో కనుపిస్తుంది. వారిద్దరూ కలిసిఉన్నప్పుడే సర్వాంగస్ఫూర్తి వహించిన ఒక్క మనిషిలాగ కనబడుతారు. ఇద్దరికీ ఒకమోస్తరు కట్టూ, ఒకమోస్తరురూపూ, ఇద్దరికీ అవినాభావసంబంధము.

వారిద్దరూ కవలలు కారు. ఏకోదరులు కూడా కారు. ఆఖరుకు బంధువు లయినా కారు. ఇద్దరూ ఒకమాటు ఒకస్కూలులో కలుసుకోవడము సంభవించింది. ఏగాలికో రెండు విత్తనాలు కొట్టుకొనివచ్చి ఒక్క అడవిలో ఒక్కచోట పడి వృక్షములుగా పెరిగినట్టు వారికుటుంబాలు ఎక్కడినుంచో చదువుకోసరము ఒ

క్క ఊరు చేరినవి. ఇద్దరూ అస్కూలులో కలుసుకొన్న క్షణము మొదలు వారికి స్నేహము ఏర్పడ్డది. ఆవేశావిశేషమో, జన్మాంతర సంబంధమో! వారిస్నేహము చూస్తే బడిలో తక్కిన పిల్లలందరికీ అసూయగా ఉండేది. మేష్టర్లకు కోపముగా ఉండేది. పిల్లలతో ఎవరితోటి అయినా పేచీ వస్తే వారిద్దరూ ఏకమయ్యేవారు, వారిద్దరూ ఏకమయినప్పుడు జయించడమంటే అంతచులకనగా ఉండేదికాదు తక్కిన వాళ్లకు. తరగతిలో ఇద్దరూ ఒకచోట కూర్చునేవాళ్ళు. మేష్టరు ఒకరిని ప్రశ్న అడిగితే చటుక్కున రెండోవాడు చెప్పుతుండేవాడు. ఆయనకు కోపము వచ్చి రెండోవాణ్ణి నిలుచోమంటే మొదటివాడు నిలుచుండేవాడు, లేకపోతే ఇద్దరూ నిలుచుండేవాళ్ళు. ఇలా అల్లరి చేస్తూ ఉన్నారని తెలివితేటల కేమయినా తక్కువా? క్లాసులో ఏలా ఉన్నా పరిక్షలలో ఇద్దరూ మొదటితరగతిలో ప్యాసు అవుతుండేవాళ్ళు. మేష్టర్లకు ఆశ్చర్యముగా ఉండి వాళ్ళు కాపీ చేస్తున్నారేమో అని పట్టుకోవలెనని విశ్వప్రయత్నము చేసినారు. అసలు పరీక్షలలో ఎవరైనా కాపీ చేస్తారన్న సంగతే ఆపిల్లలకు తెలియదు.

వారికి ఎంతస్నేహమో స్వభావాలలో అంత తారతమ్యము ఉంది. సూర్యచంద్రాదుల కెంతతారతమ్యమున్నదో వారిలో అంత తారతమ్య మున్నది. శ్రీనివాసరావుకు చురుకుపాలు ఎక్కువ. అశాంతి. తొందర. చంచలము. పాదరసము మోస్తరు. పనిలోనూ, మాటలోనూ, నడకలోనూ, చదువులోనూ పరుగే. ఏది తలుచుకొంటే అది నిముషాలమీద అయిపోవాలి. అయ్యేదాకా అతనికీ దగ్గిరున్నవాళ్లకూ కూడా నిద్రాహారము లుండవు. పని చేస్తున్నకొద్దీ తొందర హెచ్చు తొందర హెచ్చయినకొద్దీ పని ఎక్కువ చేస్తారు. పనిలో ఉన్న చురుకు మాటలోనూ. మాటపట్టింపు వచ్చి ఏదన్నా అంటే ఎదటివాళ్లు ఎందులోనైనా పడి చావవలసినదే. ఈచురుకుకుతోడు కొంచెము సూరేకారము పాలు ఎక్కువ. కాని ఆకోపము నిలవ ఉండదు. ఒక్కమాటు చిచ్చుబుడ్డిలా చురచురలాడి తక్షణము పోతూ ఉంటుంది.

శ్రీనివాసరావుకు ఎంతదుడుకో శంకరరావుకు అంత శాంతము. శ్రీనివాసరావు హృదయములో రక్తము పర్వతఝరిలాగ ప్రవహిస్తూ ఉంటుంది. శంకరరావు హృదయములో రక్తము సైకతశ్రేణిపైన ప్రవహిం

చే నెలయేరు వలె ఉంటుంది. శంకరరావు మాట్లాడితే అమృతము ఒలుకుతూ ఉంటుంది. కోపము వచ్చి ఎవరి నైనా పడతిట్టినా తిట్లు పడేవాడి మనస్సుకు బాధ కలుగదు. హృదయము ఎంతగంభీరమో గమన మంత మందము. శంకరరావుకు కోపము రాగా ఎప్పుడూ ఎవ్వరూ చూడలేదట. ఏమబ్బులయినా అడ్డు వచ్చినప్పుడు చంద్రకాంతిఅయినా మరుగుపడుతుంది కాని, శంకరరావు ముఖములో హాసచంద్రికలుమాత్రము ఎప్పుడూ మరుగు పడేవి కావు. శ్రీనివాసరావు కుర్రాళ్ళతో పేచీలుపడి వస్తే శంకరరావు వాళ్ళందరనూ సమదాయించి తియ్యనిమాటలు చెప్పి పంపించేవాడు. శ్రీనివాసరావు రాజసుడు, శంకరరావు సత్వమూర్తి.

ఇద్దరికీ చక్కదనము అంటే అభిమానము ఎక్కువ. సౌందర్యవిహీన మయిన వస్తువుకానీ మనిషికానీ కనబడితే అక్కడ నిలవబడలేకపొయ్యేవారు. అది గర్వముకాదు, పుట్టుకతో వచ్చిన స్వభావము. వాళ్ళేమి చేయగలరు? ఒక్కసారి అమిత అందవికారి అయిన మేష్టరు వారిక్లాసుకు వస్తే ఇద్దరూ ఆక్లాసుకు వెళ్ళడము మానివేసినారు. హెడ్ మేష్టరుచేత రోజూ దెబ్బలు అయినా తినేవారు కాని ఆక్లాసులో కూర్చు

నేవారు కారు. ఇద్దరిహృదయములూ అతికోమలములు. తమకు కాదుకదా ఎవరికి ఏ బాధ వచ్చినా సహించలేక పొయ్యేవారు. కోమలమే కాకుండా అతివిశాలము. వారి చిన్నహృదయములలోనే ప్రపంచమంతా ఇమిడిఉండేది. భావాలు అతిఉన్నతములు. నీచోద్దేశాలూ, చిన్నఊహలూ ఎప్పుడూ వారిమనస్సులో ప్రవేశించి మలినపరచలేదు. అటువంటి ఉద్దేశాలూ ఊహాలూ ప్రపంచములో ఉంటవనికూడా వారెరుగరు. పుట్టినప్పుడు ఏ అమాయికత్వముతో పుట్టినారో ఆ అమాయికత్వము వారితోపాటు పెరుగుతూ వచ్చింది కాని జ్ఞానము రాగానే వారిని విడిచిపెట్టలేదు. బాగా ఎరిగిన వాళ్ళకు, ఇంకో కలోకములో ఉండవలసిన పిల్లలు పొరపాటున ఈలోకములో పడ్డట్టు ఉండేది, కాని ఈలోకములో పుట్టి ఈఅన్నము తింటూ పెరిగిన పిల్లలులాగ ఉండేదికాదు. రెండుసూర్యకిరణాలో చంద్రకిరణాలో పొరపాటున ఆకాశమునుంచి జారిపడిన వనుపించేది వాళ్ళను చూస్తే.

శ్రీనివాసరావు కూర్చోడము నేర్చుకొన్నప్పటినుంచీ పెన్సలుతోటో సుద్దతోటో అస్తమానము గీట్లు గీస్తూ ఉండేవాడు. నాల్గుఅయిదు ఏళ్ళు వచ్చేసరికి ఆగీట్లకు ఒకస్వరూపము ఏర్పడ్డది. బడిలో చదువుకోవడము ఆరం

భించేసరికి చక్కనిబొమ్మలు గీస్తూఉండేవాడు. బొమ్మగీయడమంటే అతనికి కలిగేఉత్సాహము ఇంతా అంతా కాదు. నిద్రాహారములుకూడా అక్కరలేకపోయేవి. ఇదే అతనికి కాలక్షేపము. లేకపోతే యేపుస్తకమోపుచ్చుకుని ఎవరితోటీ మాట్లాడకుండా ఏమూలో కూర్చుండేవాడు. అదీ కాకపోతే ఏచెట్లకేసో, ఏపక్షులకేసో, పశువులకేసో దారేపోయేమనుష్యులకేసో, తదేకదృష్టితో చూస్తూ కూర్చునేవాడు. శంకరరావు ఏపాటి వెళ్ళినప్పటినుంచీ సంగీతము వినబడేటప్పటికి అక్కడ జేరేవాడు. ఎంత ఏడుస్తూ ఉన్నాసరే, ఎంతకోపము వచ్చినాసరే, సంగీతము వినబడేసరికి కోపము మరచిపోయి ఏడుపుచాలించి నిశ్చలముగావింటూకూర్చునేవాడు. తల్లి జోలపాట పాడనిదే ఎప్పుడూ నిద్రపొయ్యేవాడు కాడు. మాటలునేర్చినప్పటినుంచీ ఏపుస్తకమో దగ్గిరపెట్టుకొని అస్తమానమూ చదువుతూ ఉండేవాడు. నాలుగుపంక్తులు వ్రాయనేర్చేటప్పటికి కొద్దితప్పులతో అది పద్యముగా ఉండేది. క్రమేణా పద్యము చెప్పడమంటె అతనికి ఉండేసరదా ఇంతా అంతా కాదు. కోపము వచ్చినా పద్యమే. సంతోషమువచ్చినా పద్యమే. ఏడుపు వచ్చినా పద్యమే తిట్టినా పద్యమే. శ్రీనివాసరావూ శంక

రరావూ క్లాసులో కూర్చుని పాఠమువినడము ఇష్టము లేకపోతే గురువుగారి బొమ్మ వికృతాకారముగా ఉండేట్టు గీయడమూ అతనిపని. ఆయన్ను హేళనము చేస్తూ పద్యములు వ్రాయడము రెండో వారిపని. పిల్లలకు వాళ్లిద్దరితోటీ తగాదా పడడమంటే హడలుగా ఉండేది. ఏమిబొమ్మలు వ్రాస్తారో! ఏమిపద్యాలు చెబుతారో! అని భయపడేవాళ్ళు పిల్లలు.

౨

వాళ్ళకు తెలియకుండానే చూస్తూ ఉండగానే కొన్ని సంవత్సరములు గడిచినవి. చాలామంది జీవితాలలో చాలామార్పులు వచ్చినవనీ, ప్రపంచమంతా కష్టమయమనీ, కాలమానము బాగుంది కాదనీ, ప్రజలు చెప్పుకోవడము మొదలుపెట్టినారు. ఈస్నేహితులిద్దరికీమాత్రము ఆమార్పు లేవీ అనుభవములోకి రాలేవు. సంవత్సరానికి ఆరుఋతువు లున్నవని ఎక్కడో కావ్యాలలో చదువుకోవడమే కాని వాళ్ళకు ఎప్పుడూ వసంతముగానే ఉండేది. కొత్తగా వికసించిన కుసుమముల సౌరభము ఎప్పుడూ వారినాసికాపుటములకు తగులుతూ ఉండేది. దివ్యమూ, గంభీరమూ, అపరిచితమూ, అయినవిశ్వగానము ఎప్పుడూ వారిశ్రవణకుహరములలో

మారు మ్రోగుతూ ఉండేది. వర్ణనాతీతము లయినవర్ణములూ, అపూర్వము లయినసౌందర్యములూ, ప్రకృతిలో వారికళ్ళ కెప్పుడూ గోచరిస్తూ ఉండేవి. అననుభూతములూ, ఇంద్రియాతీతములూ, అపూర్వశోభాయుతములూ, బ్రహ్మానందదాయకములూ అయినదృశ్యములు వారిమానసాకాశమున శరత్కాలమేఘములులాగ పరుగుపెడుతూ ఉండేవి. ఇవన్నీ స్వప్నములా అని సందేహము కలిగేది. స్వప్నములకు విలక్షణమయిన ఒకానొక ఆనందము, జాగ్రదవస్థలోకూడా ఉండడముచేత ఇవి స్వప్నములు కాజాలవని నిశ్చయించుకొన్నారు వాళ్ళు. అయితే ఆదృశ్యముల స్వభావము ఏమిటో వాటిభావ మేమిటో తెలిసికోవలెనని ప్రయత్నము చేసినారు. ఏగురువుల నడిగినా, వీరిప్రశ్నలే వారికి బోధపడేవి కావు. ఎప్పటికైనా వాటిభావము తామే తెలుసుకోవలెనని నిశ్చయము చేసుకొన్నారు. జ్ఞాపకము ఉన్నంతవరకూ ఆదృశ్యములు చక్కని వర్ణములతో శ్రీనివాసరావు చిత్రించడానికి ప్రయత్నముచేసేవాడు. మృదుమధురవాక్కులతో వాటిని వర్ణించవలెనని శంకరరావు ప్రయత్నిస్తుండేవాడు.

ఈ ఎండమావులను అనుసరించడములో మరి కొన్ని సంవత్సరాలు నిముషాల్లా గడిచిపోయినవి. ఇద్ద రికీ నిండుయౌవనము వచ్చినది. కళలలో సర్వతోముఖ మైన కౌశలము సంపాదించినారు. ఈ అజ్ఞాతసుఖములను వెదుకడములో, ఈ పాండితీ సంపాదనలో శరీరము కొంత డస్సిపోయినది. మానసాకాశము మేఘావృత మయినది. వెనకటిదృశ్యములు వెనకంటినవి. జీవితములో ఆనంద ము తగ్గినది. ఒకవిధమయిన అశాంతి బయలుదేరినది. తగినంతకారణము కనుపించదు. సరిఅయిన ఉపశాంతి లేకపోయినది. వెనుకటి ఆనందము కోరి తెచ్చుకొన్నదీ కాదు. ఇప్పటిఅశాంతి వారిలోపమువల్ల వచ్చినదీ కాదు. కాని ఇన్ని సంవత్సరములకు వసంతఋతువు పోయి వర్షఋతువు వచ్చినది—మధ్య హేమంతమూ శిశిరమూ లేకుండా శరత్కాలము తరువాత వసంతము వస్తుందేమో !

౩

నడివర్ష కాలము. శ్రావణమాసము. ఆసంవత్స రము గోదావరీపుష్కరము. వర్షములు అఖండముగా కురిసి పుష్కరానికి కొంచెము తెరపి ఇచ్చినవి. గోదా వరి పొంగి పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తున్నది. రాజ

మహేంద్రవరములో ఎక్కడా అడుగు పెట్టడానికి శక్యముకాకుండా పుష్కరానికి వచ్చిన జనము కిక్కిరిసి ఉన్నారు. పుష్కరము పదురోజులు గడిచిపోయినవి. వచ్చినజనము కొంతమంది తిరుగుముఖము పెట్టినారు. సాయంకాలము అయిదుగంట లవుతుంది. శ్రీనివాసరావూ శంకరరావూ బజారులోకి షికారు వచ్చినారు. అక్కడి జనసమూహాన్నీ దుకాణాలనూ చూస్తూ నెమ్మదిగా దారివెంట వెళుతూ హఠాత్తుగా ఇద్దరూ ఒక బొమ్మలదుకాణముదగ్గిర ఎవరో బలవంతాన పట్టుకొని ఆపినట్లు ఎవరిమట్టుకు వారు నిలవబడిపోయినారు. నిష్కారణముగా హృదయములో ఆందోళన బయలుదేరినది. చిరకాలముకిందట పోయిన వస్తు వేదో తలవని తలంపుగా కనపడినట్లు ఇద్దరూ ఒక్క మాటుగా దుకాణముకేసి చూచినారు. నిద్రలో నడిచినట్లు ఇంతజనసమూహాన్నీ మరిచిపోయి నాల్గు అడుగులు ముందుకు వేసినారు.

దుకాణముదగ్గిర అనేకులు బొమ్మలు కొనుక్కొంటు న్నారు. వారిమధ్య అనుపమలావణ్యవతి అయిన ఒకయువతికూడా బొమ్మలు కొంటూ ఉన్నది. ఆమెసౌందర్య మామె దే. సుమారు పద్దెనిమిది సంవత్సరము

లుంటవి. నవనవోదయమయిన యౌవనమునకుతోడు సౌందర్యరాశిననే అవ్యక్తగర్వముతోనూ, చుట్టూ ఉన్న జనసమూహమూ ఎదుట ఉన్న బొమ్మలసముదాయమూ చూచుటవలన కలిగిన ఆనందముతోనూ ఆమె విశాల నేత్రములు తాండవిస్తున్నవి. ఆమెకు రోజాపుష్పమునందలి నాజూకూ సౌకుమార్యమూ కొంచెము తక్కువగా కనుపించినా, పామరహృదయములను ఆకర్షింపజాలిన బంతిపువ్వులలోని నిండూ, కాంతీ ఉన్నవి. ఆమె సౌందర్యము పారిజాతసౌరభమువలె ఇంద్రియములను మెల్లిగా లాలించి దివిజలోకమును స్ఫురింపజేయలేకపోయినా, సంపంగిసుగంధమువలె తక్షణము తల కెక్కి మతిభ్రమణము కలుగజేస్తుంది; ద్రాక్షాసవమువలె రసనకు రుచికరముగా ఉండి శరీరమును పులకాంకితముచేయక, మద్యమువలె తక్షణము ఇంద్రియములను వశముచేసుకొంటుంది.

శంకరరావు హృదయములో ఆందోళన బయలుదేరినది. ఇన్నిదినాలనుంచీ ఉన్నమాంద్యము ఒక్కసారి సూర్యదర్శనము కాగానే మంచుతెరవలె తొలగిపోయినది. భావతరంగములు ఒకదాని నొకటి తరుముకొని వస్తున్నవి. అతనిదృష్టి ఎదురనున్న వాటి నతిక్రమించి

పోయినది. ముఖమునకు వింత తేజస్సు వచ్చినది. నిర్దుష్టమైన ఆయువతి మానవరూపము అతని మనోవీధిలో ఇంతకన్నను లావణ్యవతి, తేజస్విని అయిన ఇంకొక దివ్య స్వరూపమును స్ఫురింపచేసినది. స్వప్నములోవలె తోచిన ఆవిగ్రహమును హృదయస్థము చేసుకుంటున్నట్లు బాహ్యప్రపంచము మనోగోచరము కాకుండా కన్నులు మూసుకున్నాడు. పెదవులు కదలడము మొదలుపెట్టినవి. మందాకినీ ప్రవాహమువలె అప్రయత్నముగా మెల్లగా స్వచ్ఛముగా ప్రవహిస్తున్న కవితాప్రవాహముతో ఈనూతనహృదయాధిష్ఠానదేవతను స్తోత్రము చేయడము ప్రారంభించినాడు. శ్రీనివాసరావుకు ఒళ్ళు తెలియలేదు. జ్వరమువచ్చిన వానివలె కండ్లు ఎర్రబడినవి. ఒళ్ళు కాగడము మొదలుపెట్టినది. జేబులోనుంచి పెన్సిలు Sketch-Book తీసి ఆయువతి రూపమును వ్రాయడము ప్రారంభించినాడు. పక్కను తనస్నేహితునీ చుట్టుపక్కలఉన్న జనాన్నీ మరిచిపోయి గబగబ బొమ్మ తరువాత బొమ్మ వ్రాసినాడు. చిత్రమని పదిమంది శ్రీనివాసరావుపక్కన చేరినారు. ఈపదిమంది ఎందుకు చేరినారో అని కారణము తెలియక ఇంకాకొంతమందీ వీళ్ళను చూసి మరికొంతమందీ చేరి పెద్దజనసమూహము ఏర్పడినది.

ఇంతలోనే అయువతి తనకు కావలసిన బొమ్మ లు కొనుక్కొని ఇంటికి పోవలెనని వెనుకకు మళ్ళినది. చుట్టూవున్న జనసమూహమును చూచినది. పరధ్యానముగా నిద్రలోవలె మాట్లాడుతున్న శంకరరావును చూచినది. యంత్రమువలె గబగబ బొమ్మను గీస్తున్న శ్రీనివాసరావును చూచినది. రెండడుగులు ముందుకు వేసి అందరివలె తానూ బొమ్మకేసి చూచినది. బొమ్మ రూపము తనదేనని గ్రహించి అట్టె సిగ్గుపడి నిలబడిపోయినది. సిగ్గుచేత ముఖము ఎర్రబారినది. ఏమి చేయడానికి తోచలేదు. అడుగు ముందుకు సాగలేదు. వ్యాకుల భావముతో పులకితయయి తలవంచుకొని నిలబడ్డది. ఈమహాభాగ్యము శ్రీనివాసరావును మరింత వ్యామోహపెట్టినది. అంతకంతకు హెచ్చుతున్న తొందరతో ఈ రూపమునుకూడా చిత్రించినాడు.

రెండునిముషాలలో తెలివి తెచ్చుకొని ఆ యువతి జనసమూహములోనుంచి వెళ్ళిపోయినది. ఎప్పుడూ ఎరుగని ఒక వింతఆనందము తోచినది. అడుగు అడుగుకూ ఆఅపరిచితుడయిన చిత్రకారుడు వెనుక వస్తున్నాడేమోనని తిరిగి చూస్తూనేఉన్నది. ఇటువంటి అనుభవము ఆమె స్వల్పజీవితములో ఎప్పుడూ అనుభవించి ఉండ

లేదు. అపరిచితుడు, కులీనుడు, చక్కనివాడూ, అయిన ఒక యువకుడు తన్ను చూచి మోహించి తన చిత్రములను వ్రాసినాడనే జ్ఞానము ఆమెకు మితిలేని ఆనందము కలిగించినది. ఇంటికి చేరేవరకూ ఆమె పాదములు తేలిపోతూ గాలిలో ఎగిరిపోతున్నట్టు ఉన్నవి. ఇంటిదగ్గర కూడా ఆమెకు ఒకచోట నిలవబుద్ధి పుట్టలేదు. భోజనము చేయలేకపోయినది. కంటికి నిద్ర రాలేదు. ఎప్పుడూ బొమ్మల దుకాణముచుట్టూ పెద్ద జనసమూహాముమధ్య నిలబడి బొమ్మ వ్రాస్తున్న శ్రీనివాసరావు కళ్లకు కట్టినట్టు కనబడుతూండేవాడు. ఆయువకుడెవ్వరో ఆయన పక్కను ఉన్నఆయనెవరో, వారెప్పుడయినా మళ్ళీ కనబడతారో కనబడరో తననివాసము తెలుసుకోవలెనని ప్రయత్నము చేస్తారేమో! తనకోసరము వారెందుకు అంత శ్రమపడతారు! తనబోటివాళ్ళను, తనకంటె చక్కనివాళ్లను ఎంతమందిని చూచిఉండరు? ఇవన్నీ ఇంక మరిచిపోవలిసినదేనా? మరిచిపోబుద్ధి కావడము లేదే! ఈమాత్రముకు ఈశ్వరుడు వారినెందుకు చూపించవలెను? ఏవో రెండుకర్రముక్కలు ఎక్కడినుంచో ప్రవాహములో కొట్టుకొని వచ్చి ఒక్కక్షణము కలుసుకొని మళ్ళీ ఎక్కడికో కొట్టుకొనిపోయినట్టు తన

దారిని తనూ వారిదారిని వారూ పోవలసినదే కాబో లు! కాని ఈజీవితములో ఈక్షణము ఒక్కటీమట్టుకు మరుపురాదు.

౮

ఇంతకాలమునుంచీ శ్రీనివాసరావునూ శంకర రావునూ ఆవహించినమాంద్యము తొలగిపోయినది. వాళ్ళజీవితములో తిరిగీ వసంతఋతువు ప్రారంభించినది. వాయువులో ఎక్కడ తిరిగినా నూతనసౌరభము, ఎటు విన్నా నూత్నగానము, ఎటుచూచినా నూత్నదృశ్యము! జీవితము పూర్వమువలె ఉండడము మొదలుపెట్టినది. మధ్య నొకసారి నిద్రపోయి లేచినట్లుగా ఉన్నది. శంక రరావుకవితాప్రవాహము గట్లు నతిక్రమించి ప్రవహి స్తున్నది. శ్రీనివాసరావు వ్రాసే చిత్రములకు లెక్కలేదు. ప్రతిప్రదర్శనములోనూ అతను వ్రాసిన బొమ్మలకే మొ దటి బహుమానము.

మేఘావృత మయిన తమజీవితములో మెరపువలె ప్రవేశించిపోయిన ఆ తేజస్విని ఎవరో తెలుసుకొని ఆమె సాన్నిధ్యములో ఉంటేనేకాని జీవితము దుర్భరము అని స్నేహితు లిద్దరకూ తోచినది. ఒక్కసారి ఆమె కనబడినంతమాత్రానే ఇంతటి ఆనందమూ, ఇంతఆవేశ

మూకలిగినప్పుడు నిత్యమూ ఆమె సన్నిధానమందు వర్తి స్తుంటే ఎట్లా ఉంటుందో? లేకపోతే ఒక్కక్షణములోని ఆనందము ఎంతకాలము నిలుస్తుంది. ఎలాఅయినా ఆమె నివాసము తెలుసుకొని ఆమెసన్నిధానము చేరవలెను, లేదా తమచిత్రలేఖనమూ కవిత్వమూ ఇంతటితో వద లిపెట్టి దేశాంతరము అయినా పోవలెనని దృఢసంకల్ప ముతో బయలుదేరినారు. కాని ఈప్రయత్నము వారికీ ఒకొ్కక్కప్పుడు హాస్యాస్పదముగా తోచేది. ఒక్క సారి పుష్కరములో కనబడిన ముఖముకోసరము ఎక్కడని వెతకడము? కలలో కనబడినవస్తువు జాగ్రదవ స్థలో వెతకబోతే ఎక్కడ దొరుకుతుంది? పురాణాల లోను ప్రబంధాలలోనూ దొరుకుతుందేమో కాని సా మాన్య మానవజీవితములో అట్టిది దుర్లభము. ఆలాగని ఈ అద్వితీయానందదాయకమయినవస్తువును దొరకదనే భీతితో అప్రయత్నముగా విడిచిపెట్టడము ఏలాగు? ఆమె కేవలము స్వప్నములోవస్తువు కాదు కదా! కళ్ళ ఎదుట కనుపించిందికదా! ఎక్కడనో ఒకచోట ఉండి తీరవలెను. కాని ఆకాశముమీదికి ఎగిరిపోదుగదా! చి రకాలము పట్టవచ్చును, అధికప్రయాస కలిగించవచ్చు ను. అయితేమట్టుకు ధృఢసంకల్పము ఉంటే ఏది అసా

ధ్యము? అందులో కేవలము స్వర్గానికి దారి చూపించ గలిగిన ఆనందస్వరూపిణి మనలక్ష్యము అయినప్పుడు ప్రయత్నలోపము ఎవరు చేస్తారు?

నిండుయౌవనము. శక్తికి మించినకార్యము ఉంటుందని గణనచేయని వయస్సు. నిద్రావస్థలో ఉండి ఒక దివ్యస్వప్నము కని హఠాత్తుగా మేల్కొనగానే కలిగిన ఆనందపారవశ్యముచేత వచ్చిన ఆవేశము. భావిజీవితాని కంతా ఆధారమయిన దేవతాస్వరూపిణి లక్ష్యము. వీరిప్రయత్నము ఇంక ఎందుకు కొనసాగదు? పట్టణాలూ, పల్లెలూ గాలించినారు. ఒకనాడు తెల్లవారే సరికి ఒకగ్రామము చేరినారు. ఉదయభానుని అరుణ కిరణాలలో ఒంటి నంటుకొనిపోయిన సన్నని గులాబి చీరె కట్టుకొని చెరువులో నీళ్లు బిందెతో ముంచుకొని విలాసముగా బిందె బుజాన పెట్టుకొని దూరాన్నించి వస్తున్న యువకులకేసి విస్ఫారితనేత్రములతో చూస్తూ నిలబడి ఉన్నది వారిలక్ష్యము. వారిప్రయత్నము సఫలమయినది. ఆమె స్వప్నము మూర్తీభవించినది అనుకొన్నది. రెండునిముషాలు వారికేసి అట్టే చూచి ముద్దులొలికేహంసగమనముతో ఇంటికి వెళ్ళిపోయినది.

శంకరరావు, శ్రీనివాసరావు కొంతకాలము ఆగ్రామములో మకాము చేసినారు. నిత్యమూ త్రికాలములందూ దేవతాదర్శనము చేసినట్లు ఆమెదర్శనము చేస్తూ ఉండేవారు. దేవతాప్రసాదమువల్ల సమస్తసుఖములూ అనుభవించినట్లు ఆమెదర్శనమువల్ల అద్వితీయానందము అనుభవిస్తూండేవాళ్ళు. నిరంతరము ఆమెను ధ్యానిస్తూ తమ కార్యములలో నిమగ్నులయి ఉండేవాళ్ళు. ఆమె కటాక్షవీక్షణములచేత వారి కృతులకు దేశమంతటా ప్రఖ్యాతి వచ్చినది.

౫

స్వప్నప్రాయముగా కాలము గడచిపోతూ ఉన్నది. వీరి కావేశము ఏమాత్రమూ తగ్గలేదు. ఆమెను చూచినకొద్దీ ఇంకా చూడవలెననిబుద్ధి చూడడముతో తనివి తీరక ఆమె సన్నిధానమందే ఎప్పుడూ ఉండవలెననే కోరిక. దగ్గరఉన్నప్పుడు ఆమెను తమస్వాధీనము చేసుకోవలెననే కామము కలుగజొచ్చినది. ఎడారిలో దాహము కాకుండా ఉండవలెనే కాని దాహమయినప్పుడు ఒక్కచుక్కతో తృష్ణ తీరదు. ఏఅమృతసరస్సులోనో మునిగి కడుపునిండా నీళ్లు తాగవలసినదే. అలాగే సత్యవతిని స్వాయత్తము చేసుకొంటేనే కాని ఉపాసనాసిద్ధి

కాదనుకొన్నారు. అందుకోసరము వశీకరణతంత్రమును ప్రయోగించ మొదలుపెట్టినారు.

సత్యవతి పరవశ అయిపోయినది. ఇదిఅంతా ఆమెకు చింతగా ఉన్నది. పుస్తకములో కథవలె తోచినది. ఏమీ ఎరుగని దినములలో రాజమహేంద్రవరములో హఠాత్తుగా వీరిని చూచుటను సంభవించినది. నిశ్చలమయిన ఆమె మానససరస్సులో ఒక్క పెనుచో చిన్నరాయి పడి అలలు బయలుదేరి సరస్సుఅంతా వ్యాపించి కలతపెట్టినవి. నాటినుంచీ వింతఅయిన మనోవికారములు బయిలుదేరినవి. యౌవనప్రాదుర్భావము యొక్క అర్థము కొంచెము కొంచెము గ్రహించగలిగినది. ఈనూత్న భావములన్నీ ఒకవిధమయిన ఆనందము కలుగజేస్తూఉండేవి. ఆనందముకంటె తరుచుగా బాధ కలుగజేస్తుండేవి. ఎవరితోటి చెప్పుకోవడానికి భయముగా ఉండేది. వివాహిత లయినసహచారిణులను చూచినప్పుడువారిపైన ఒకవిధమయిన అసూయపుట్టేది. ఈకలతపడిన మనస్సును కుదుట పరిచేది ఎలాగు? చెప్పనలవికాని ఈహృదయతాపము శాంతించడము ఎలాగు? బాధకు కారణము ఫలానా అని తెలిసినప్పుడు బాధ నివారించడానికి ప్రయత్నము చేయవచ్చును. ముక్కూ ముఖమూ

లేని మనోవికారములకు మం దేమిటి ? పుష్కరములో హఠాత్తుగా కనబడి తన హృదయగవాక్షములను తెరిచి వింతచిత్రములను చూపించినయువకులు తనకు మళ్ళీ ఎప్పటికీ కనుపిస్తారని కలలోనైనా అనుకోలేదు. తిరిగీ హఠాత్తుగా ఒకరోజున సూర్యోదయముతోపాటు ఆకాశమునుండి దిగి వచ్చినట్లు వారు చెరువుదగ్గిర ప్రత్యక్షమయ్యేసరికి చెప్పశక్యముకాని ఆనందము అనుభవించినది. వా రాగ్రామములోనే కాపుర ముండి ఎప్పుడూ తనకు కనబడుతుం డేసరికి ఇకప్రపంచములో తనకు కావలసిన దేమీా లేదనుకొన్నది. కాని అతిశీఘ్రకాలములోనే చూపులతో హృదయశాంతి కాదని తెలుసుకొన్నది. ఎప్పుడూ వారిసన్నిధానమందే ఉండి వారిపాదసేవ చేస్తూఉంటే ఏమైనా కొంతశాంతి కలుగుతుందేమో కాని, వారిని చేరడ మెలాగా ? తనను వివాహము చేసుకుంటా రన్నమాటేమిటి ? చేసుకుంటేమట్టుకు అందులో ఎవరిని తాను చేసుకోవడము ? ఇదొకచిక్కు. ఎలా నిశ్చయించుకొనేది ? ఏమి హెచ్చుతగ్గులేకుండా ఉన్న రెండురత్నములు ఎదుటపెట్టి అందులో ఒకటి తీసుకొమ్మంటే ఎలాగ ? కళ్ళు మూసుకొని చేతికేది దొరికితే అది తీసుకోవడమే. ఇక్కడకూడా కొంచె

మించుమించుగా అంతే జరిగింది. శ్రీనివాసరావును వివాహము చేసుకోవలెనని నిశ్చయము చేసుకున్నది. అందుకు కారణ మడిగితే మట్టుకు ఆమెకే తెలియదు. ఏమైతే నేమి, మనస్సులో నిశ్చయించుకున్నది. పైభారము దేవునిపైన పెట్టినది.

౬

శ్రీనివాసరావుకోరిక సిద్ధించినది. ఇంతకాలము నుంచీ తన్ను నిలువెల్లా దహిస్తున్నతాపము నేటికి చల్లారినది. ఈసౌఖ్యముకోసరము ఎంత కోరినా కోర్కె ఫలిస్తుం దనిమట్టుకు కలలోనైనా అనుకోలేదు. నేడా సౌఖ్యము కలిగినా బ్రహ్మానందదాయక మయిన ఈక్షణములో సౌఖ్యముతోపాటు కొంతవిచారముకూడా ఉన్నది. శంకరరావుకు మనసుకు కలిగేబాధ తలచుకొంటే ఈసౌఖ్యమువల్ల కలిగే ఆనందము పోతూ ఉన్నది. భారతయుద్ధానంతరము అర్జునుడివలె ఇతనిమనస్సు ఆందోళన పొందినది. శంకరరావును కలుసుకొన్నదిమొదలు ఒక్కమోస్తరుగా గడిచినజీవితములో నేటికి మార్పుకలిగినది. శంకరరావుకష్టము చూచి తనుకూడా బాధ పడినా తనసౌఖ్యము చూచి శంకరరావు అతని కష్టము మరిచిపోయినా తనకూశంకరరావుకూ మధ్యను

పెద్ద అగాధ మేర్పడ్డదని అనుకొన్నాడు. కాని ఏమి చేయగలడు ? ఈస్నేహముకోసరము సత్యమును విడిచి పెట్టుకోవడమా ! సత్యముకోసరము తనశరీరములో అర్ధభాగమును బాధపెట్టడమా! రక్తనాళములలో పొంగి పొరలుతున్న యౌవనోద్రేకము అణ్చుకొట్ట లేకపోయినాడు. అతనిజీవితవసంతములో దయాదాక్షిణ్యము లేక బాధించిన మన్మథుణ్ణి జయించడానికి మహేశ్వరస్వరూపము తాల్చ లేకపోయినాడు. హృదయములో బయలుదేరి తన్నుదహించివేసిన ప్రేమానలమును ఆర్పడానికి సముద్రుడు కాలేకపోయినాడు. దైవసమానుడని విర్రవీగుతున్నవాడు కేవలము మానవు డయిపోయినాడు ! సత్యము మళ్ళీ తనమానవత్వము తొలగించి దైవత్వము ఇప్పిస్తుం దనే భ్రాంతితో ఆమెను వివాహము చేసుకొనడానికి నిశ్చయించుకొన్నాడు. శంకరరావును అన్యాయము చేస్తున్నానేమో ననుకొన్నాడు. కాని సత్యము తన అంగీకారము తెలియపరచినప్పుడు ఇంకా చేయవలసిన దే మున్నది ?

వివాహము కాగానే శ్రీనివాసరావూ, సత్యమూ ఆగ్రామము విడిచిపెట్టి శ్రీనివాసరావుగారి ఊరు చేరినారు. శ్రీనివాసరావు సంతోషానికి మితిలేదు. అతని

ఆనందము అంటువ్యాధివలె అందరుస్నేహితులకూ వ్యాపించినది. అత నెక్కడికి వెళ్ళినా శీతకాలములో సూర్యోదయములాగ అత నున్న కాసనేపూ ఎంతకష్టములో ఉన్నవా ళ్ళయినా అతనితోపాటు నవ్వుతుండేవాళ్ళు. జీవితమంతా ఇంత ఉత్సాహముతో నిండిఉన్నప్పుడు ఏకార్యము తలపెడితేమట్టుకు జయప్రదముగా నెరవేరదు ? ఎన్ని చిత్రములు లిఖించినాడో లెక్కలేదు. అతను బహుమానము పొందని ప్రదర్శనము లేదు. దేశమంతటా సౌందర్యమును వ్యాపింపజేసినాడు. యువకులకు సౌందర్యపిపాస కలిగించినాడు. ఆనందయోగమువల్ల పరమాత్మను తెలుసుకోవచ్చునని ఉపదేశించినాడు. ప్రపంచముదృష్టి నంతా తనవైపుకు ఆకర్షించుకొన్నాడు.

౭

శ్రీనివాసరావు వివాహము కాగానే శంకరరావు తన చిరకాలమిత్రుణ్ణి విడిచిపెట్టి దేశాంతరము వెళ్ళిపోయినాడు. తనలో కొంతభాగము విడిచిపెట్టినట్టుగా ఉన్నది అతనికి. తనమనోభీష్టము సిద్ధించకపోయినా శ్రీనివాసరావు సుఖపడుతున్నాడుగదా అనేభావముతో తనకష్టమును సగము మరిచిపోయినాడు. శ్రీనివా

సరావుకు మళ్లీనే నాడు పుష్కరములో ఆపిల్లను చూసి నప్పటినుంచీ తనకూ హృదయములో నూత్న భావములు స్ఫురించినవి. అదివరకున్న అశాంతి కొంత శాంతించి నది. కానీ తనకు ఆపిల్లను వివాహము చేసుకోవలెనని బుద్ధిపుట్టినది. కాని శ్రీనివాసరావును జయించి నంత పూర్తిగా సత్యవతి శంకరరావును జయించలేక పోయినది. అతన్ని చాలావరకు తనవైపు ఆకర్షించుకొన్నది కాని అక్కడ నిలుపుకో లేకపోయ్యేది. ఆమెను చూచినప్పుడు శంకరరావు తన్మయత్వము పొందేవాడు. కానీ ఉత్తరక్షణమందే నిద్రలో ఏదో దుస్స్వప్నముకని మేలుకొన్నట్టు లేచి ఆమెకేసి వింతగా చూచి, మారు మాట లేకుండా చక్కాపొయ్యేవాడు. శ్రీనివాసరావు మోహించినంత తీవ్రతతో, తనూ సత్యమును మోహించినా ఆమె తన్ను కాదని శ్రీనివాసరావును వివాహము చేసుకొన్నప్పుడు పడవలసినంత బాధ పడలేదు. ఒక మోస్తరుగా ఇదే బాగుందనుకొన్నాడు కాని ఏనుయ్యో గొయ్యో చూచుకొందా మనుకొన్నంత విరక్తి పొందలేదు. కాని మొట్టమొదట ఆమెను చూచినప్పుడు తనహృదయములో నిలుపుకొన్న దేవతనుమట్టుకు మరచిపోలేదు. ఇంక ఇక్కడనే ఉంటే శ్రీనివాసరావు

ఆనందముకేమన్నా భంగము కలుగుతుందేమో నను
కొని ఎక్కడనయినా ఏకాకిగా నిర్జనప్రదేశములో తన
దేవతను తనకు తోచినరీతిగా ఉపాసించి బ్రహ్మానంద
మును పొందవలెనని నిశ్చయము చేసుకొని దేశాంతర
ము వెళ్ళిపోయినాడు.

వెళ్ళి వెళ్ళి ఒకనిర్జనప్రదేశములో కుటీరము
నిర్మించుకొని అక్కడనివాసము ఏర్పాటుచేసుకొన్నాడు.
ఎటుచూసినా మనుష్యసంబంధము లేదు. ఉదయాన్నే
పక్షుల కలకలారావముల మేలుకొలుపులతో లేచేవా
డు. పక్కను ప్రవహిస్తున్న సెలయేటిలో స్నానముచేసి
ఫలములను భుజిస్తూ ప్రకృతివైచిత్ర్యములకు ఆశ్చర్యము
చెందుతూ, తుచ్ఛప్రపంచమునంతా మరిచిపోయి కేవ
లము ఋషివలె కాలక్షేపము చేస్తుండేవాడు. ఆప్రకృతి
గర్భములో, ఆసెలయేటిరొదలతో పక్షులకూజితముల
తో, హృదయవీణను మేళవించి ఉదయరాగములతో
భావగీతికలను పాడుతూ తనదేవతను ఉపాసిస్తుండే
వాడు.

అప్పుడప్పుడు స్నేహితులు తీర్థయాత్రకు వచ్చి
నట్టు ఇతనిదగ్గిరకు వచ్చి కొన్ని దినములుండి ఇతనిపాట
లనూ పద్యములునూ వింటూ కలగిపోయినహృదయము

లనూ, చెదరిపోయినమనస్సులనూ డస్సిపోయిన శరీర ములనూ, బాగుచేసుకొని నూత్నవికాసముతో వింత ఆనందముతో స్వగృహములకు వెళ్ళుతుండేవారు. కొంద రు స్నేహితులు తాము అనుభవించిన ఆనందమును తాము పొందినహృదయశాంతిని తమవలె దుఃఖితాత్ము లయిన ఇతరులకుకూడా తెలుపవలెననే ఉద్దేశ్యముతో శంకరరావు కవితాప్రవాహమును అతనికి తెలియకుం డానే దేశమంతా వ్యాపింపచేసినారు. అతని అమృత వాక్కులు అనేకుల హృదయములకు శాంతికలగజేసి నవి. అనేకమందికవులకు ఆదర్శప్రాయ మయినవి.

౮

ఈ ప్రపంచములో జీవితమువలెనే ఏదీ శాశ్వత ముగా ఉండదు కాబోలు! ఆనందస్వరూపుఁడు నిత్య మయినప్పుఁడు ఆనందముమట్టుకు ఎందుకు నిత్యముగా ఉండకూడదు? సూర్యకాంతి మంచిది అయినా అస్త మానమూ సూర్యుడివంక చూస్తూఉంటే కళ్ళు మిరుమి ట్లు గొలుపుతవి. అలాగే ఆనందము నిత్య మయినట్లయి తే అది కూడా జీవుడికి కొంతబాధ కలిగిస్తుందేమో! ఏమయితే నేమి; ఏఆనందము కోసరము మనజీవితమంతా వృథాగా ధారపోస్తామో ఆఆనందము మెరుపుతీగలాగ

ఒకమెరుపు మెరిసి పోతుంది కాని అక్కడ నిలవ ఉండదు.

అద్వితీయ మయినఆనందము అనుభవిస్తూమిత్రు ల నందరినీ ఆనందింపజేస్తున్న శ్రీనివాసరావు ఆనందా నికికూడా భంగమువచ్చినది. ఆనందముయొక్క పరమా వధిచేరినాననుకొన్నక్షణములో తను అనుభవిస్తున్నది ఆనందచ్ఛాయ కాని ఆనందముకాదని తెలుసుకొన్నా డు. మెరుపుతీగెవంటి దీపపుకాంతికాని మెరుపుతీగె కాకపోయినది. ఏదేవత నుపాసించి ఆమెఅనుగ్రహాము చేత స్వర్గవీధులలో విహరించి పరమాత్మను తెలుసుకో వలె ననుకొన్నాడో ఆదేవత కేవలము మానవస్త్రీ అయిపోయినది. ఆమె కేవలము తన్ను ఇంద్రియలోలు ణ్ణి చేసినది. ఎప్పుడూ అంబరవీధిని ఎగురుతూ ఉండే తనఆత్మను రెక్కలు కత్తిరించి వేసి భూలోకములో బం ధించివేసి క్రమేణా పాతాళములోకి అణగద్రొక్కినది. ఈమిథ్యాసౌఖ్యము అనుభవించిన కొద్దీ నిర్వేదము హెచ్చినది కాని నిజమయిన ఆనందము కలిగించి హృద యశాంతి నివ్వలేదు. ఆకాశముమీద ఎగరవలె నను కొంటే భూమిమీద నడవడమే కష్టమనిపించినది. తను ప్రజల కుపదేశించిన ఉపదేశమును తనేఅనుభవించలేక

పోయినాడు. తను వ్రాసిన చిత్తరువులపైన తనకే అస హ్యము తోచినది. కొన్నిటిని ముక్కలు ముక్కలుగా చించి పారవేసినాడు. తను ఉపాసించిన దేవత దయ్యము గా మారినది. అంతకంతకు హృదయములో వేదన హెచ్చిపోయినది. సత్యము ఎదుట పడితే సహించ లేకపొయ్యేవాడు. తననాశముకు కారణ మామే అని భావించినాడు.

పాపము, ఆమె ఏమి చేయగలదు? ఆమెను అని ఏమిప్రయోజనము? అనాగరకపుపడుచు, పల్లెటూళ్ళో పుట్టి పెరిగినది. పట్నవాసపుపద్ధతులూ, నాగరికుల ఊహలూ ఆమె కేమి తెలుస్తవి? అడవిలో పుట్టి పెరిగిన పూలమొక్కను ఉద్యానవనములో పెంచడానికి తొట్టిలో పెడితే ఏమంత అందముగా ఉంటుంది? ఆమె తనవల్ల ఏవిధమయినలోటూ రాకుండా ఉండవలెననే ప్రయత్నము చేసినది. తనగ్రామములోకెల్ల తనే చక్కనిపిల్ల.స్థితిమంతురాలు. తదుపరి విద్యావతి. వీటి నన్నిటినీ మించి నవమన్మథులయిన యువకు లిద్దరు నాగరికాగ్రేసరులు తన్ను వరించినారు. ఇంక ఆమె కహంకారము కలిగినదంటే ఆమెతప్పా!

శంకరరావును తను పూర్తిగా వశము చేసుకో లేక పోయినది. అది కాకుండా శ్రీనివాసరావు అస్తమానమూ తనబొమ్మలు గీస్తూంటే ఒకవిధమయిన ఆనందము కలుగజేసినది. అందుచేత శ్రీనివాసరావును వివాహాము చేసుకొన్నది. అతన్ని సంతోషపెట్టవలె నని శాయశక్తులా తంటాలు పడ్డది. కాని కొలదికాలము లోనే తాను విఫలమనోరథ అయినట్టు తెలుసుకొన్నది. ఏమి చేయగలదు? వరిచేలలలో ఉండే నవనవ జనపచేలలో ఉండేవాసన బంతిపూలలో ఉండేనిండే కాని నాగరికుల కిష్టమయిన కేరాణిసౌరభము మల్లెపూవుసౌకుమార్యము తనతో తీసుకు రాలేకపోయినది. అది ఆమె లోపము ఎట్లా అవుతుంది? తన భర్త తన్ను ప్రేమించడము లేదని తెలుసుకొన్నది. ఆమధ్య వ్రాసినచిత్తరువు లన్నీ చింపివేయడము చూసింది. తనకుకూడా తన ప్రతిబింబము, ప్రతిఇంటా ప్రతిదుకాణముమీదా, ఉండడము హేయ మనిపించినది. తనభర్తకు తను సౌఖ్యమివ్వలేనప్పుడు తనకు జీవితములో ఉండేఆనందము నశించిపోయినప్పుడు తనింకా అక్కడ ఉండి భర్తను బాధించడ మెందుకు? ఎక్కడికయినా పోయి తనదారి తను చూచుకొంటే శ్రీనివాసరావు ఎప్పటికయినా

పూర్వపుమనిషి అవుతాడేమో. ఎప్పటికో ఒకప్పటికి అతను సుఖపడడముకదా తనకు కావలసినది. తనకు చేతకానప్పుడు అతనిసౌఖ్యానికికూడా అడ్డు రావడ మెం దుకని తనదారిని తను పోవడానికి అనుజ్ఞ ఇవ్వవలసిన దని శ్రీనివాసరావును కోరినది. ఉభయులకూ అదే మం చిదని చెప్పినది. శ్రీనివాసరావు ఎంతచిత్రకారు డయి నా మనుష్యమాత్రుడు. సత్యమును చూసేటప్పటికి అ తని మనస్సు చాలా క్లేశపడ్డది. ఆమెలోటు ఏమీ లేక పోయినా ఆమె నింతగా బాధించినాముకదా, అని చాలా విచారించినాడు. ఈకష్టములకంతా కారణము తనూ కాదు ఆమేకాదు. జీవితములో ఒకగొప్పపొర బాటు. ఆమె చెప్పినట్లు ఎవరిదారి వారు చూసుకోవ డమే మంచిదేమో! అందుచేత ఆమె కోరినప్పుడు ఆమె ఇష్టము వచ్చినచోట ఉండవచ్చుననీ ఆమె కేలో టూ లేకుండా చేస్తాననీ చెప్పినాడు.

ఎక్కడినుంచో గాలికి కొట్టుకు వచ్చి తనపాద ములవద్ద పడిన పుష్పమువలె ఆమె అతనిజీవితములో ప్రవేశించినది. ఆపుష్పముతో తనగృహము కొన్నాళ్లు అలంకరించుకున్నాడు. కొంచెము వాడుదల చూపగా నే బయటకు పారవేసినాడు. ఇంకొకగాలి వచ్చి దాన్ని ఎక్కడికో ఎత్తుకు పోయినది.

౬

శంకరరా విప్పుడు భక్తాగ్రేసరు డైనాడు. శ్రీ చైతన్యస్వామివలె భక్తిపారవశ్యముచేత తన్మయు డవుతూ ఉంటాడు. ఇప్పు డతనినోటినుంచీ ఏవాక్కు వచ్చినా భక్తివిషయముతప్ప మరొకటి లేదు.

శంకరరావు మొదటినుంచి కూడా సత్యమూర్తి. అందుచేతనే అతనికవిత్వము తామసికము కాదు. అమృతప్రవాహమువలె హృదయమున కెప్పుడూ శాంతి నిస్తూఉండేది. జ్ఞానము వచ్చినప్పటినుంచీ నేటివరకూ అతనిహృదయము అనేకమార్పులు పొందింది. వాటితో పాటు అతనికవిత్వముకూడా మారుతూ ఉండేది. ఒకప్పుడు పర్వతఝరివలె ప్రవహించినా, ఒకప్పుడు ఝంఝామారుతమువలె కనపడ్డా, ఒకప్పుడు మలయమారుతమువలె ఉన్నా ఎప్పుడూ అందులో అమృతత్వము మట్టుకు లేకపోలేదు. ఏస్వరూపములో ఉన్నా ఆనందదాయకముగానూ శాంతవంతముగానూ ఉండేది. క్రమేణా క్రొత్తపంథలకు పోతూ నూతనఆదర్శములను చూపుతూ ఉండేది. పోను పోను సమస్తకళలు, కావ్యములు, శాస్త్రములు, వేదాంతములు, అన్నిటి ఉద్దేశమూ సత్యాన్వేషణమనీ, దానిఫలము ఆనందమనీ, ఆఆనంద

మే పరబ్రహ్మమనీ, అతనికవిత్వమువలనా, జీవితము వలనా చాటుతూ వచ్చినాడు. మొదట dreamer, తరువాత కామి. పిమ్మట ఋషి, ఆఖరికి అభిసారికగా మారినాడు. ఈకాలములో ఇంతమహాకవి, భక్తుడు, గాయకుడూ లేడనేఖ్యాతి అప్రయత్నముగా వచ్చినది.

ప్రపంచములో ఏవిధమైన సంబంధము లేకుండా, ఎక్కడో ఒంటరిగా కూర్చుని తపస్సు చేసుకుందామని ఎంతప్రయత్నము చేసినా ఈకాలములో సాగడము కష్టము. ఎవరో ఒకరు ఈరహస్యము బయటపెట్టకమానరు. అక్కడనుంచి ఎవరో ఒకరు వచ్చి తపోవిఘ్నము కావించక మానరు.

ఒకనాటిసాయంకాలము ఆకాశము నిర్మలముగా ఉన్నది. అస్తమిస్తున్నసూర్యుడు వర్ణనాతీతములైనచిత్రములతో ఆకాశము నంతా చిత్రించి వెళ్లిపోతున్నాడు. పక్కనున్నసెలయేరు ఏమేమో గొణుగుకుంటూ తన దారిని వెడుతూ ఉన్నది. చల్లగాలికి ఆకులు కొంచెము గలగలలాడుతూ కదలుతూ ఉన్నవి. చీకటి పడిపోతుందనే భయముచేత పక్షులు తొందరగా గుంపులు గుంపులుగా గూళ్లకు చేరుకుంటున్నవి. చీకట్లు అన్నిపక్కలనుంచీ అలముకొని వస్తున్నవి.

శంకరరావు ఈశ్వరధ్యానము చేస్తూ తనపర్ణ శాలముందు ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు. తనవెనుక నెవరో అనతిదూరములో తనపద్యములే చదువుతున్నట్టు వినబడ్డది. వెనుకకు తిరిగి చూచాడు, ఎవ్వరూ కనపడలేదు. కంఠము కొంచెము కటువుగా ఉన్నా స్త్రీకంఠమువలె ఉన్నది. ఎప్పుడో పరిచితముగాకూడా ఉన్నట్టుతోచినది. "ఎవరు వారు" అన్నాడు శంకరరావు. డస్సినశరీరముతో, మాసిన బట్టలతో, తడబడే అడుగులతో, కన్నీరు కారుస్తూ, తలవంచుకుని సత్యము ముందుకు వచ్చినది. "అమ్మా, రా కూర్చో. ఇంత శ్రమపడి ఇక్కడికిప్పుడు వంటరిగా ఏలా వచ్చావు? ఎందుకు విచారిస్తున్నావు? శ్రీనివాసరావేడి? అతడు సుఖముగా ఉన్నాడా"అని తొందరతొందరగా సమాధానానికి ఆగకుండానే ప్రశ్నలు అడిగినాడు. అమ్మా అనేమాటఅతనినోటి వెంట రాగానే, ఆమె ఆశావీణలో, సూక్ష్మమైన ఆఖరుతంతువు తెగిపోయినది. దానితో ఆమెకు మరింతదుఃఖము వచ్చినది. శంకరరావు ఎప్పుడూ ఏవిధమైన దుఃఖమూ సహించలేక పోయేవాడు. అందులో అబల, అసహాయురాలు, తనదగ్గరకు వచ్చి ఇలా విచారిస్తూ ఉంటే మరీ భరించలేక ఏమి చేయడానికీ తోచక ఆమెను కూర్చోమని కన్నతల్లివలె ఓదార్చినాడు.

కొంతసేపటికి పొరలివస్తున్న దుఃఖతరంగములను ఆపుకొని, రాళ్ళనుకూడా కరగించేచూపుతో ఒక్కసారి శంకరరావును చూచితలవంచుకుని తనవృత్తాంతము సమగ్రముగా చెప్పినది. దుఃఖమును ఆపుకోలేక మళ్లీ ఒకసారి విచారించి, "నాకింక ఎక్కడా నిలువడానికి నీడ లేదు. దిక్కులేదు మీరే నాకు దిక్కు. మీరుగా ఒకప్పుడు కొద్దో గొప్పో నన్ను ప్రేమించినారు. ఆకారణము చేతనే ఇక్కడకు వచ్చినా ననుకుంటాను. నే నప్పుడు మిమ్ములను కాదని ఆయనను వివాహము చేసుకోడము గొప్పపొరపాటు! అందువల్లనే మా కిద్దరికీ ఈకష్టము. ఆపొరపాటు మన్నించమని కోరడానికి వచ్చినాను. అపరాధములు ఎంతటివాళ్లకయినా వస్తవి. మీ రీస్వల్ప కాలములో నన్ను మరిచిపోయిఉండరు; వెనుకటిప్రేమ ఇంకా ఏలేశమాత్రమో మిగిలి ఉండకపోదు; దయాస్వరూపులు, నామొర ఆలకించకపోరనే నమ్మకముతో మీపాదములమీద పడదామని వచ్చినాను. ఇంక పాల ముంచినా నీటముంచినా మీదే బాధ్యత!" అని పెద్దపెట్టున రాగాలుపెడుతూ శంకరరావు కాళ్లపైన పడబోయినది.

శంకరరావు ఆమెను పట్టుకొని లేవదీసి కూర్చో పెట్టి "అమ్మా, విచారించకు. ఎంతపని జరిగినది! నీవు చెప్పినదంతా వింటే నాకు చాలా కష్టముగా ఉన్నది. కాని నే నేమి చేయగలను? నేను నిన్ను ఒకప్పుడు ప్రేమించినానని అనుకున్నాను. అది సరియైన ప్రేమ కాదని నాకు అప్పుడే అనుమానము కలిగి వివాహము కొరకు నిన్ను అట్టె తొందర చేయ లేదు. నిన్ను మొదటచూచినప్పుడు నీకంటె భిన్నమైన దేవతాస్వరూపిణి ఒకతె నాకు ప్రత్యక్షమైనది. నేను నిశ్చయముగా నాటికీ నేటికీ ప్రేమించినది ఆమెను కాని నిన్ను కాదు. ఆమెయే నాపాలిటికి రమాదేవియై సమస్తఐశ్వర్యములనూ ఇచ్చినది. ఆమెయే సరస్వతీదేవియై నన్ను కవిని చేసినది. ఆమెస్వరూపము అణుమాత్రమూ నీలో లేదు. తల్లీ, ఒకానొకప్పుడు నిన్ను ప్రేమించానన్నభ్రాంతి నీకు కలుగచేసినందులకు క్షమించు. నిన్ను ప్రేమించుట తప్ప మరేసహాయమైనా నేను చేయగలిగినది ఉంటే తప్పక చేస్తాను. ప్రస్తుతము చాలా అలసినట్లు ఉన్నావు ఈఫలములు ఫలహారముచేసి ఈరాత్రికి ఇక్కడ విశ్రమించు. తరువాతసంగతులు ఉదయము మాట్లాడవచ్చు" అని ఆమెముందు కొన్నిఫలములూ ఉదకమూ ఉంచి

తన హృదయశాంతికోసము అరణ్యములోకి వెళ్ళిపోయి నాడు.

సత్యమునకు పట్టరానిదుఃఖము వచ్చినది. శంకర రావు మాటలవల్ల ఇంక నిక్కడ తనకు ఏఆశా లేదని నిశ్చయమైనది. "ఔరా! ఎంతచిక్కు. అప్పుడు శంకరరావును పెండ్లిచేసుకున్నా ఇంతే అయ్యే దన్నమాట! అవును. నాబోటినిర్భాగ్యురాలి కింతసౌఖ్యము ఏలా నిలుస్తుంది. ఇంక భవిష్యత్తు అంటూ లేదుకదా. ఏమూలనో పడిఉండి నాజీవితములో స్వల్పకాలమును తేజోవంతముగా చేసిన ప్రభాతకిరణములను తలుచుకుంటూ కాలక్షేపము చేయవలసినదే కాబోలు" అని విచారిస్తూ అక్కడనే పడుకుని నిద్రపోయినది. తెల్లవారుఝాముననే లేచి, శంకరరావుకు కనపడకుండా చెప్పకుండా వచ్చినదారినే వెళ్ళిపోయినది. ఎక్కడికో! మూసుకుని వస్తున్న చీకట్లతో వచ్చినది. మళ్ళీ విరిసిపోతున్న చీకట్లతో విరిసిపోయినది!

౧౦

సత్యము వెళ్ళిపోయినప్పటినుంచీ శ్రీనివాసరావు మరీ పిచ్చివాడు అయిపోయినాడు. ఏపని చెయ్యాబుద్ధి అయ్యేది కాదు. చదువుదా మంటే మనసు కుదురుగా

ఉండేది కాదు. సత్యమును అన్యాయము చేశామే అని ఒకబాధ. తనచేతిలోవిద్య తన కెప్పుడూ ఆనందము కలుగుచేసేది తన్నేదో ఉద్ధరిస్తుంది అనుకున్నది ఎందుకూ పనికిమాలి వృథా అయిపోయినదే అని ఒకవిచారము. తనజీవితమంతా నాశనమై పోతున్నది అనిబెంగ. దీనితో ఏమీ తోచక బోనులో సింహములాగ ఇంట్లో ఊరికే తిరుగుతూ ఉండేవాడు. కొన్నాళ్లు అయ్యేసరికి ఆఊరూ, ఆఇల్లూ, ఆఇంట్లో వస్తువులూ చూస్తూ ఉంటే మరీ అసహ్యముగా ఉండేది. అందుకని కొన్నాళ్ళు అక్కడనుంచి లేచిపోయి శంకరరావుదగ్గర ఉంటే మనశ్శాంతి కలుగుతుం దేమో నని అక్కడకు బయలుదేరినాడు.

ఒకనాడు తెల్లవారేసరికి శంకరరావునివాసము దగ్గరకు చేరినాడు. అప్పుడే సూర్యోదయ మవుతున్నది. ఎక్కడచూచినా కలకలలాడుతూ పక్షులు. నలుదిక్కులనుంచీ కమ్మని పుష్పసౌరభము. తుమ్మెదలఝుంకారము. సెలయేటిగానము. ఏమిప్రశాంతము, ఏమిసౌందర్యము! ఏమిఆనందము ! శ్రీనివాసరావు ముగ్ధుడై పోయినాడు.

ఆశ్రమముదగ్గరకు వచ్చినకొద్దీ ఋషివాటికను సమీపించినప్పుడు క్రూరమృగములుకూడా శాంతము

వహించినట్లు శ్రీనివాసరావుహృదయము ఆందోళన తగ్గి శాంతించినది.

శంకరరావు అప్పటికప్పుడే లేచి, స్నానముచేసి ప్రభాతసంకీర్తన చేస్తున్నాడు. అది పూర్తిఅయ్యేవరకూ, శ్రీనివాసరావు దూరాన నిశ్శబ్దముగా నిలబడ్డాడు. కొంతసేపటికి శంకరరావు కళ్ళుతెరచి తల ఎత్తి చూచాడు. ఎదుట కన్నుల నీళ్ళుకారుస్తూ నిశ్చేష్టుడై నిలబడ్డ శ్రీనివాసరావు కనపడినాడు. ఒక్కపరుగున వెళ్ళి ఆతనిని ఆలింగనము చేసుకున్నాడు. ఎంతసేపు ఇద్దరూ అలా బాష్పపూరితనయనములతో రుద్ధకంఠములతో, నిండుహృదయములతో నిలబడ్డారో తెలియదు. కొంతసేపటికి స్మృతి తెచ్చుకుని నిశ్శబ్దముగా కుటీరములోకివచ్చి కూర్చున్నారు. అటువంటిక్షణములలో మాటలు ఏమివస్తవి? అప్పుడు మాటలు లేకుండా మౌనముతో చెప్పేలాలనవాక్యములే ఎక్కువ హృదయశాంతి నిచ్చేది. కొంతసేపటికి పెద్దవర్షము కురిసి వెలిసిన పిమ్మట ఉన్నఆకాశమువలె ఉన్నది అతని మనస్సు.

కొన్నాళ్లు అక్కడనే ఉన్నాడు శ్రీనివాసరావు. మనిషి. మామూలుమనిషి. అయినాడు. మళ్ళీ ఇంటికి వెళ్లుదా మనేబుద్ధి పుట్టినది. "శంకరం, మళ్ళీ యింటికి

వెళ్ళడమంటే భయముగా ఉన్నది. అక్కడ వెనుకటి యమబాధ పడతానేమో! ఇంక నాకు తరుణోపాయము లేదా? నీవిజయమునకు కారణము ఏమిటి? నా వినాశానికి కారణము ఏమిటి?" అన్నాడు శ్రీనివాసరావు.

"శ్రీనివాసుడా, నేను పొందిన పెద్దవిజయమూ లేదు, నీవు పొందిన పెద్దవినాశమూ లేదు. జీవితమంతా ఇంకా ఎదుటనే ఉన్నది. ఇదొక అనుభవము. ఇది ఒకందుకు మంచిదే కాని ఒక్కసంగతి చెపుతాను. నీడను చూచి నీవు వస్తువని భ్రమపడినావు. సౌందర్యవంత మయినరూపము కనపడగానే బాహ్యరూపమును పట్టుకుని, ఈసౌందర్యమునకూ తేజస్సుకూ కారణమైన లోపలఉన్న దివ్యస్వరూపమును విడిచిపెట్టినావు. బాహ్యరూపము ఎంతచక్కగా ఉన్నా త్వరలో నశించక మానదు. ఎంతచక్కని పువ్వైతేమట్టుకు వాడిపోయినతరువాత ఆనందము ఇవ్వలేదు కదా. అందుకని ఆమిథ్యారూపాన్ని విడిచిపెట్టి లోపల ఉండే తేజోమూర్తిని తెలుసుకుని ఆరాధిస్తే, నీజీవితము ఆనందమయమవుతుంది. నీ కిదివరకు చేసిన ఉపదేశములన్నీ సార్థకమవుతవి. సమస్తవిద్యలకూ కళలకూ అదే పరమార్థి. నాకు

ఇది తెలియనిది కాదు. మధ్యను వచ్చిన ఈఅనుభవము ఇకముందు సత్యాన్వేషణకు మరింత సహాకారిగా ఉంటుంది. ఇంక నాలుగురోజులిక్కడ ఉండి కొంతపని ప్రారంభించి వెళుదువుగాని లే" అన్నాడు శంకరరావు.

౧౧

శ్రీనివాసరావుకు మళ్ళీ నూతనోత్సాహమువచ్చినది. తిరిగి తనకు ప్రేమాస్పదమైన చిత్రలేఖనము ప్రారంభించినాడు. అత నిదివరకు ఎప్పుడూ అనుకొననివిషయము ఒకటిస్ఫురించినది. కుంచె అప్రయత్నముగా కాగితముమీద జరగడ మారంభించినది. ఒకరంగు కలుపవలెనని ప్రయత్నముచేస్తే తా నిదివరకు ఎప్పుడూ ఎరుగని చక్కని కొత్తరంగు ఒకటి తయారయ్యేది. బొమ్మ అతిత్వరగా పూర్తి అయినది. అది సత్వరూపిణి అయిన జగన్మాతరూపము. శ్రీనివాసరావే ఆపటముయొక్క సౌందర్యమూ, జీవమూ చూచి ముగ్ధుడై, దేవికి సాష్టాంగము చేసినాడు. స్త్రీరూపము అయినా ఆపటములోకనపడేది దేవతకాని మానవస్త్రీకాదని ప్రతివాళ్లూ ఒప్పుకున్నసంగతే. అది అతీంద్రియ విషయము. ఆజగన్మాత సాక్షాత్కారము లేనిదే మానవమాత్రుడు డాచిత్తరువును చిత్రించి ఉండలేడు. మామూలురంగులతో చిత్రించిన

పటము కాదది. అదొక దివ్యస్వప్నము. చిత్రమును శం కరరావుకు అంకితము చేసినాడు.

నాటినుంచీ శ్రీనివాసరావు వ్రాసినబొమ్మలకు క్రొత్తరూపమూ, వింతసౌందర్యమూ వచ్చినవి. సామాన్యులకు అర్థమయ్యేవి కావు. అలంకారగోష్ఠివలె ఉండేవి. క్రమేణా అతనిపేరూ శంకరరావుపేరూ దిగంతములకు వ్యాపించినవి. అనేకమందికవులకూ చిత్రకారులకూ వారుమార్గప్రదర్శకు లయినారు. వారితో నూతనయుగ మొకటి ప్రారంభ మైనది.

# భిక్షువు.

'మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధుస్సహోదరాః
అర్థం నాస్తి గృహంనాస్తి' ..................

౧

అది పుష్యమాసము. ఉదయము ఆరుగంటలు అయినది. చలి చాలా ఎక్కువగా ఉన్నది. మంచు కూడా ఈ సంవత్సరము మామూలుకంటె చాలా ఎక్కువగా ఉండి సన్నని వర్షపు తుంపురులవలె పడుతూ ఉన్నది. కన్నూకన్నూ కనుపడడము లేదు. బెజవాడ వెళ్ళవలె ననే ఉద్దేశ్యముతో రైలుకొరకు గోదావరి స్టేషనుకు తెల్లవారుఝామున నే వచ్చి కూర్చున్నాను. ఎంతమాత్రమూ ఎవ్వరికీ అవసరము లేదు గనుక గోదావరిమీదనుంచి గాలి రంయ్యనివీస్తూ గజగజలాడిస్తూ ఉన్నది. మంచు దోమతెరవలె అన్నివైపులనూ కప్పివేయడముచేత ఎదురనున్న రైలుపట్టాలుకూడా కనుపడడము లేదు. స్టేషనుబయిట బళ్ళ చప్పుడు, మనుష్యుల మాటలూ మట్టుకు వినపడుతూ ఉన్నాయి.

'మాతానాస్తి పితానాస్తినాస్తి బంధుస్సహోదరాః, అర్థంనాస్తి గృహంనాస్తి......' అనేశ్లోకము నాచెవిని పడ్డది. మాతృశబ్దమునకు సర్వవిధములా

ఉదాహరణగా నున్న మాఅమ్మకూడా స్వర్గస్థురాలై అప్పటికి నెలరోజులుమాత్రమే అయినది. అప్పటి నాఅవస్థ తలుచుకుంటే సరిగా ఆశ్లోకములో చెప్పినట్టే ఉన్నది. ఆమాటలు నాచెవిని పడీపడడములో అప్రయత్నముగా నాకళ్ళవెంబడి నీళ్ళు వచ్చినాయి.

ఎవరు చెపుమా ఈప్రశాంతప్రభాతవేళ ఈవేదాంతోపదేశముతో కలిగిఉన్న నా హృదయాన్ని మరింత కల్లోలపెట్టినవారు అనుకున్నాను. మాటలు చెవిని పడడమే కాని మంచులో మనిషి కనుపడలేదు. నావలె వైలుకు వచ్చిన బాటసారి అయివుంటాడా? పాపము అతనూ ఏమికష్టములో ఉన్నాడో అనుకుంటూఉండగానే నాసందేహము నివారణ అయినది.

'కామక్రోధంచ లోభంచ మోహంచ మదమత్సరాః.'

'తలితండ్రులారా, కడుపు కాలిపోతోంది. నాలుగురోజులయింది అన్నము కళ్ళచూచి. ధర్మము చెయ్యండి పుణ్యాత్ములారా! ఈనిరుపేదను రక్షించండి' అనే ఆర్తనాదము నాచెవులపడ్డది. వెంటనే మనిషికూడా కనుపడ్డాడు. తొంభయిఏళ్ల తొక్కులా ఉన్నాడు. గోచీ పెట్టుకున్నాడు. ఇంకొక చిరుగులగుడ్డ కప్పుకున్నాడు.

చేతులో ఒక వెదురుకర్ర ఉన్నది. దృష్టి బాగా మంద గించినట్లు తెలుస్తున్నది. తలా గడ్డమూ మీసమూ నెరసి ముగ్గుబుట్టలా ఉన్నవి.

మూడు కోట్లు తొడుక్కుని పైన శాలువ కప్పుకున్న నాకే చలి భరించడానికి శక్యము కాకుం డా ఉంటే ఇంక పాప మాభిక్షువుసంగతి వేరే చెప్పడ మెందుకు.

ఆ ఆర్తనాదము విని ఆమనిషిని చూచేటప్పటికి నాకు పట్టరాని దుఃఖము వచ్చినది. నాకు ఎప్పుడు ఏముష్టివానిని చూచినా చాలా జాలిగా ఉంటుంది. వాడికివ్వడానికి దగ్గర ఏమీ లేకపోతే ఏడుపు వస్తుంది. అదృష్టవశాత్తూ కాస్త ఉన్న ఇంట్లో పుట్టడముచేత కాని లేకపోతే, ఆ అవస్థలో ఉండవలసినవాళ్ళమే కదా అనో, లేక స్వకష్టార్జితములోనో ఉన్నది కాస్తా ఊడ్చి పెట్టుకుపోతే ఇలాగే బయలుదేరవలసివస్తుంది కదా అనే భీతో, లేక, అందరికీ ఒక్కమోస్తరు అవకాశ ములుఉండి జీవయాత్రలో అంతా ఒక్కచోటనే బయ లుదేరుతే ఆబిచ్చగాడే ఒకప్పుడు మనకంటె ఎక్కువ గా ఉండవచ్చుననే అనుమానమో, ఏకారణమో తెలి యదుకాని భిక్షువును చూచినప్పుడు మట్టుకు చేతనైన

సాహాయ్యము చెయ్యకుండా వెళ్లలేను. ఏకారణమేనా కావచ్చును కాని చవుకగా పుణ్యము సంపాదిద్దామని, ఏపావలాడబ్బులతో స్వర్గము కొందామనీ ఉద్దేశ్యము మట్టుకులేదు.

అందులో ప్రస్తుతము నే ఉన్నస్థితిలో ఆభిక్షువు స్వరూపము చూచి వాడు అన్నమాటలు వినేటప్పటికి నాగుండె తరుక్కుపోయినది. వానిని పిలిచి, డబ్బుఇద్దామని చూచేటప్పటికి దగ్గర చిల్లరడబ్బులు లేకపోయినవి. ఒక్కఅణాకాసు ఉన్నది. పోనీ అని అదితీసి వాడిచేతిలో పెట్టినాను. వాడు అది కళ్ళదగ్గరగాపెట్టి చూచుకుని 'బాబూ నాదగ్గర చిల్లర లేదండి. నాలుగురోజులనుంచి ఒక్కడబ్బు నాచేతులో పెట్టినవారు లేరండి' అన్నాడు వణుకుతూను. "పరవాలేదులే, చిల్లర అక్కరలేదు. ఏమైనా కొనుక్కతిను" అన్నాను. వాడు మాట్లాడకుండా మళ్ళీ ఆ అణాకాసుకేసి చూచి, వంగి నాముఖము ఒక్కమాటు పరీక్షగా చూశాడు. వాడి కళ్ళలో నీళ్లు నిండినాయి. ఆ దుఃఖముచూడలేక, నేను నాముఖము ఒకపక్కకు తిప్పుకున్నాను. అంత ఆభిక్షువు నిటారుగ్గా నిలువబడి, కళ్ళు తుడుచుకుని, ఒక్క నిట్టూర్పు విడిచి 'Thank you sir, may God bless you' అని ముందుకు సాగినాడు.

ఆమాట ఇంగ్లీషున అనడమూ, ఆభావఉచ్ఛా రణా వినేటప్పటికి నాకు ఆశ్చర్యము కలిగినది. 'ఎవరా భిక్షువు? చదువుకున్న వానివలె ఉన్నాడే! మొదట ఏవో రెండుశ్లోకములు చదువుతే ఊరికే భిక్షాటనచేయ డమున కుపకరిస్తవని నేర్చుకున్నాడు కాబోలు నను కున్నాను. కొంపతీసి బాగా చదువుకున్నవాడేమో. ఇలా ఉండడమునకు ఎంతెంతకష్టము లనుభవించి ఉం డవలెనో, ఈస్థితికి ఎందుకు వచ్చినాడో' తెలుసుకుం దామని బుద్ధిపుట్టినది. ఆపూటకు నాప్రయాణము ఆగి పోయినాసరే వానిసంగతి తెలుసుకోవలెనని నిశ్చయిం చుకున్నాను.

లేచి పదిఅడుగులలో అతన్ని కలుసుకున్నాను. అతన్ని పలుకరించి, "రండి, కాఫీహోటలుకు నేను తీసు కువెడుతాను. నాకూ ఆకలిగాఉండి నేనూ వెడుతు న్నాను" అన్నాను. భిక్షువు ఆగి, "అయ్యా! నేను సా మాన్య భిక్షువును; తమరు గొప్పవారు, చదువుకున్న వారు. నన్ను బహువచనములో సంబోధించవలసిన అవసరములేదు. నేను మీకంటె పెద్దవాడినే అనుకోం డివయసులో. అయినా ఆకారణముచేత రోడ్డుమీద కన పడే ప్రతియాచకుణ్ణి, మీబోంట్లు గౌరవించ నక్క రలేదు" అన్నాడు.

"అవునులెండి; ఆమాట నిజమే. కాని ఏకారణ ముచేతనో మిమ్ములను చూస్తే, మీరు మామూలు బిచ్చగాండ్రు కారనీ, కొంతపెద్దబ్రతుకు బ్రతికి, కాల వశమున ఈ అవస్థ అనుభవిస్తూన్నారనీ తోచి మిమ్ము లను గౌరవించ బుద్ధిఅయినది. దానిలో తప్పు ఏము న్నది! నమస్కారము వెళుదాము" అన్నాను.

"అయ్యా! తాము నాకోసము వస్తున్నట్లు తోస్తు న్నది. ఇంతవరకూ తాముచేసిన ఉపకారమే ఎక్కువ. నేను భిక్షాటన మారంభించినప్పటినుంచి ఒక్కరుకూడా ఒక్కసారి అణా యిచ్చినవారు లేరు. ఇచ్చిన స్వల్పమే నా విసుక్కోకుండా ఇచ్చినవాళ్లు బహుఅరుదు. అట్టిస్థి తిలో తాము మాట్లాడకుండా నన్నుపిలిచి అణా ఇవ్వ డమే కాకుండా ఇంకా నాకోసము మీరు శ్రమపడడము నాకు ఎంతమాత్రమూ ఇష్టములేదు" అన్నాడు.

"నేను మీకోసము రావడములేదులెండి. వచ్చి నాతప్పులేదు. ఊరికే గోరంత కొండంతచేసి మీరు అలా స్తోత్రము చేస్తూఉంటే నాకు సిగ్గుగా ఉన్నది" అన్నాను.

"నాకోసము కాదంటే నేనెలా నమ్మను. ఇంత ఉదయాన్నే ఈచలిలో స్టేషనుకు ఊరికేవచ్చి కూర్చోరు

గదా, ఎక్కడికేనా ప్రయాణముమీదనైె ఉండవలెను కదా. రైలుకు టైములయినది. అదుగో గంటకూడా కొడుతున్నారు. దయచేసి నాకు సెలవు ఇప్పించండి. పూర్వజన్మసంచితము అనుభవిస్తున్నానుకదా! ఈయాచనలవల్ల ఉత్తరజన్మమునకు కొంతఋణము జాగ్రతపెట్టుకుంటున్నానుకదా! అవసరమైనకంటె నన్ను ఎక్కువ ఋణస్థుణ్ణిగా చెయ్యకండి. బాబూ, నామనవి విని తమరు దయచెయ్యండి," అన్నాడు. నేను వల్లకాదని పట్టుపట్టి కాఫీహోటలుకు తీసుకువెళ్ళినాను.

అక్కడికి వెళ్ళినతరువాత లోపలికి రమ్మంటే రానన్నాడు. ఎన్నివిధముల చెప్పినా వినలేదు. అందుచేతను ఇద్దరమూ వీధిఅరుగుమీదనే కూర్చున్నాము. ఆయనకు కావలసినదంతా ఆయన అడుగకుండానే కనిపెట్టి వడ్డనేవరకూ తెప్పించి యిప్పించినాను. ఫలహారము అయ్యేవరకూ మేమేమీ మాట్లాడలేదు. ఒకటి రెండు సార్లు భిక్షువు కళ్ళనుండి కన్నీటిచుక్కలు ఆయన ఆకులో పడడము చూచినాను.

ఫలహారముకాగానే లేచి, అయినసొమ్ము ఇచ్చివేసి, "దయచెయ్యండి వెడదాము" అన్నాను.

"ఎక్కడికి, బాబూ? ఇకనైనా తమపని చూచుకోరా" అన్నాడు.

"వెడతాలెండి! దయచెయ్యండి" అన్నాను. మారుమాట లేకుండా నావెంట వచ్చాడు.

తిన్నగా గోదావరీతీరమునకు వెళ్లి అక్కడ మఠము అరుగుమీద కూర్చున్నాము.

"అయ్యా! నాదొక్కకోరిక ఉన్నది. తమర్ని అడుగకూడనిసంగతి ఒకటి అడుగుతాను. అన్యథా భావించక, తమజీవితచరిత్ర కొంత సెలవివ్వవలెను. నాకు వినవలెనని చాలా కుతూహలముగా ఉన్నది. తమకు కష్టముగా ఉంటేమట్టుకు తమరిని శ్రమపెట్టను" అన్నాను.

"అయ్యా, ఈరోజునతమరు నాకుచేసిన మహోపకారమునకు నాకృతజ్ఞత ఎట్లా చూపవలెనో తెలియకుండా ఉన్నది. ఈజన్మలో నే నెప్పుడూ మరవజాలని దయను నాయెడల కనుపరచినారు. నా చరిత్ర చెప్పడానికి అభ్యంతర మేమీుంటుంది. కాని చెప్పవలసినంత విశేషమేమీ లేదు. ఉన్నదికాస్తా తమబోట్లువిని ఆనందించేదికాదు. అయినా తమకు వినవలెనని ఉంటే, చెప్పుతాను" అన్నాడు.

"ముఖ్యముగా వినవలెనని ఉన్నది. దయచేసి చెప్పండి" అన్నాను.

మంచు ఇంకా తెరిపి ఇవ్వలేదు. గోదావరిమీా దనుమరీ ఎక్కువగా ఉండి నీరుగాని నీటిపైని పడవలుగాని పక్కనున్న రైలువంతెన గాని కనుపించడము లేదు. దగ్గరనున్న మెట్లమీాదనుంచి స్త్రీలు నీళ్లబిందెలు బుజాన ఎత్తుకునివస్తూ వెడతూ ఉన్నట్లు, కాళ్లఅందెలచప్పుళ్లవల్లను తెలుస్తున్నది. మరము అరుగుమీాద మాకుకొంచెము దూరములో నలుగురు బైరాగులు కూర్చుని 'జయ్ శంకర్ భగవాన్' అని మధ్యమధ్య గంజాయి పీలుస్తూ దగ్గుతూ కూర్చున్నారు. రోడ్డుమీాద నొక ఒంటెద్దుబండి నెమ్మదిగా కునికిపాట్లుపడుతూ వెడుతున్నది. భిక్షువు "అయితే వినండి చెపుతాను" అని తనకథ ప్రారంభించినాడు.

౨

భిక్షువు కథ

ఏడెనిమిది సంవత్సరములక్రితము నన్ను మీారు చూచిఉన్నట్లైతే ఇప్పుడు నన్ను గుర్తించలేకపోయేవారు. మీారన్నమాట ఏమిటి. నాభార్య నన్ను గుర్తించలేకపోయినది. మీారు ఆశ్చర్యపడవలసిన పనిలేదు. మీారనుకుంటున్నట్లు ఏడుసంవత్సరములకాలము మనిషిలో ఇంతమార్పును తీసుకురాలేదు. ఒకవేళను అది

సాధ్యమైనా ఇంతవిచారమూ, అవస్థా ఉండకపోయేవి. అట్టిమార్పు క్రమేణా వచ్చేది. వస్తున్నదని మనకు తెలిసేది. మనము అందుకు సిద్ధపడి ఉండేవాళ్లము. కాని ఒక్కరోజులో ఇంతమార్పు వస్తుందని కలలోనైనా కథలోనైనా నమ్మగలరా? కాని జరిగినదంతే. ఒకపుష్పము వాడిపోవడమునకైనా దాని అల్పాయుష్ప్రాయములో కొంచెము ఇంచుమించుగా నాలుగవవంతుకాలము పడుతుందే. ఒకమనిషి పీనుగులాటివాడు ఇలా మారడానికి ఎంతకాలము పట్టవలెనో ఆలోచించండి. ఎంత ప్రబలవ్యాధి ఉన్నా ఒక్కరోజులో ఇంతమార్పు పొందగలడా? Oh God' తలచుకుంటే గుండె బద్దలైపోతుంది. క్షమించండి. మొదలు చెప్పకుండా తుదకు వస్తున్నాను. నాసంగతి తలచుకుంటే ఆవేశము పట్టలేను.

నే నిప్పుడు మనవిచేసినట్లుగా ఏడెనిమిది సంవత్సరములక్రితము నేను వేరుగా ఉండేవాడిని. ఇప్పటివలె ఎండిపోయిన ఒరుగులా ఉండేవాడిని కాను. నిండుయౌవనములో ఉండేవాడిని. వేడిరక్తము పొంగి పొరలుతూ వరదరోజులలో గోదావరివలె నారక్తనాళములలో ప్రవహిస్తూ ఉండేది. చిన్నప్పటినుంచీ వ్యాయామక్రీడలయందు ఆసక్తిగా ఉండి కృషి చేయడముచేత

నాశరీరము కండలుదేరి పాశ్చాత్య శిల్పిచెక్కిన శిలావి గ్రహమువలె చూడ ముచ్చటగాఉండేది. నాశరీరమును చూచుకుంటే నాకే ఎంతో సంతోషముగా ఉండేది. అందుచేతను దాని నెంతో జాగ్రతగా కాపాడుకుంటూ ఉండేవాడిని. ఈ అంగసౌష్ఠవమునకుతోడు నాముఖము కూడా చక్కగా ఉండేదని అందరూ అనుకునేవాళ్లు. అసలు ఎక్కువ అందము లేకపోయినా, మనిషి పిసా గులా ఉండి నిండుయౌవనములో ఉంటే సామాన్యుడై నా అందముగానే కనుపడుతాడు. దానికితోడు కొంచెము చక్కదనము ఉంటే ఇంక చెప్పనే అక్కరలేదు. అందు చేత ప్రతివాళ్లూ నాకేశి చూస్తూ, నన్ను స్తోత్రముచే స్తూ, నాసహవాసము నపేక్షిస్తూ ఉండేవాళ్లు.

నాతలితండ్రులకు నేనొక్కడనే పుట్టినాను. అం దుచేత నెంతో గారాబముగా పెరిగినాను. ఆటలయం దూ పాటలయందూ ఉన్నశ్రద్ధ నాకు చదువులో ఉం డేదికాదు. స్కూలుపాఠములంటే అసలే చదువబుద్ధి అయ్యేదికాదు. తరుచు నవలలో ప్రబంధములో చదువుతూ ఉండేవాడిని. ఏమిచదివినా ఏమిచదవకపో యినా నెమ్మదిగా స్కూలుఫైనలు ప్యాసయి ఇంటర్మీ డియేటులో ప్రవేశించినాను. రెండోసంవత్సరములో

చదువుతూ ఉండగా నాకు వివాహము జరిగినది. నావివాహ మైన కొద్దిమాసములకే మాతండ్రిగారు హఠాత్తుగా కాలము చేసినారు. సంసారము నెత్తినిపడ్డది. సంసారమంటే పెద్ద శాదరబందీ ఏమీలేదు. ఏదో కొద్దిగా ఉన్నవాళ్లముకాని అంత బొత్తుగా లేనివాళ్లముకాము. అయినా నాకుమట్టుకు చదువబుద్ధి అయినదికాదు. అందుకని చదువుమాని కొన్నాళ్లు ఇంటిదగ్గర ఊరికే కూర్చుని కాలయాపనచేసినాను. అలాఊరికే కూర్చోవడము నాకే బాగా లేకపోయినది. అందుచేతను ఉద్యోగప్రయత్నము చేసినాను. అధికారిఅన్న అడ్డమైనవాళ్లచుట్టూ తిరిగితిరిగి ప్రాణముఘిసిగి ఆప్రయత్నము మానుకొన్నాను.

ఇలాకొన్నాళ్లు గడచినతరువాత పోలీసు ఇనస్పెక్టరీకి ప్రయత్నము చెయ్యవలెనని బుద్ధిపుట్టినది. ఆప్రయత్నము చెయ్యగానే, వెనుకటివలెగాక, నాప్రయత్నము సఫలమైనది. సెలెక్షను దొరకినది.

నలుగురితో పాటూ ట్రయినింగుఅయి ఉద్యోగములో ప్రవేశించినాను. చాలాన్యాయముగా ఉండవలెననీ, కష్టపడి పనిచేయవలెననీ, వృత్తిగౌరవము కాపాడవలెనని మహదాశయములతో ఉద్యోగము ప్రారం

భించినాను. కొలదికాలములో చాలామంచివాడిననీ, న్యాయస్థుడననీ, చురుకైనవాడిననీ పేరుపొందినాను.

ఉద్యోగములో ప్రవేశించిన కొద్దిరోజులకే నా భార్య కాపురమునకు వచ్చినది. ఆవిడకూడా చాలా చక్కని మనిషి. మే మిద్దరమూ చిలుకా గోరువంకల వలె ఉండేవాళ్లము. చుట్టుపక్కలవాళ్లు మా అనుకూలదాంపత్యము చూచి ఎంతో సంతోషించేవాళ్లు. నా భార్యకు నాపై నున్నప్రేమ తలచుకుంటే నాకే ఆశ్చర్యముగానూ ఒకప్పుడు భయముగానూ ఉండేది. నాలుగు సంవత్సరములపాటు ఒక్కక్షణముకూడా నన్నువిడిచి ఉండలేదు. నేను దగ్గరలేకపోతే పుట్టింటికికూడా వెళ్లేది కాదు. ఆనాలుగు సంవత్సరాలూ అద్వితీయమూ, మానవాతీతమూ అయిన సౌఖ్యమును అనుభవించినాము.

సంతోషము ఎప్పుడూ దుఃఖముతో మిళితము కాకుండా ఉండదు కాబోలు. ఒడలెరుగనిసంతోషములో ఉండగా మాఅమ్మ నాలుగురోజులు జ్వరము వచ్చి స్వర్గస్థురాలైనది. నిశ్చలమైన మా ఆనందసరస్సులో ఒకపెద్దరాయి పడినది. అలలు బయలుదేరినవి. మా అమ్మపోయిన విచారములో ఉండి సెలవుతీసుకు

ని ఉండగా, సెలవు ముగియగానే మన్యమునకు మార్చి నామనీ, ఒక్క సంవత్సరము అక్కడ పనిచేయవలసిన దనీ ఆర్డరు వచ్చినది. దానితో మేమిద్దరమూ మరీ బెంగపెట్టుకున్నాము.

ఆమన్యప్రాంతములకు నాభార్యనుకూడా ఎట్లా తీసుకువెళ్లను. అది సాధ్యముకాదు. అందుకని ఆమెను పుట్టింట విడిచి వెళ్లవలెను. ఒక్కసంవత్సరము ఆమెను విడిచి ఉండడము ఎట్లాగు. నామాట ఎలాఉన్నా అందుకు నాభార్యే ఒప్పుకోలేదు. సుతరామూ పుట్టింటికి వెళ్లనన్నది. తనూ నాతో వస్తానన్నది. లేకపోతే నన్ను ఉద్యోగము మానుకోమన్నది. ఉద్యోగము మానుకోవడము ఎట్లాగు? పనియందు నాకు ఉత్సాహము కలిగినది. మంచిపేరుకూడా వచ్చినది. ఏదో ఒక ఏడాదిపాటు శ్రమపడితే తిరిగి మన్యము విడిచి వచ్చే టందుకి ప్రమోషనుకూడా అవుతుంది. ఇదంతా నాభార్యకు బోధపరచి చెప్పినాను. తుదకు ఎలాగైతేనేమి సమాధానపరచి పుట్టింట దిగపెట్టినాను. కాని మాకిద్దరకూ కూడా మనసులో ఒక చెప్పరాని భయమూ బెంగా బయలుదేరినది. ఈజన్మములో నింక ఇద్దరమూ కలుసుకోమేమో అనుకున్నాము. ఏదో గొప్ప

కష్టము రానున్నదనే భ్రాంతిమట్టుకు మాకు బాగా తోచింది. ఆబెంగతోటే ఒకరోజున బయలుదేరి నా ఉద్యోగముఊరు చేరుకున్నాను.

3

ఆ అరణ్యముల సౌందర్యము వర్ణించడానికి నా పాటివానికి శక్యముకాదు. ప్రస్తుతము అవసరమూ లేదు. కాని ఒక్కమాటమట్టుకు చెప్పక తప్పదు. అక్కడి ప్రకృతిసౌభాగ్యమును చూచి ముగ్ధుడనై పోయాను. ఆ ఆనందములో నాబెంగను కొంత మరచిపోయినాను. ఇటువంటిచోట నాకు ఏమి అపాయము వస్తుంది అను కున్నాను. నాలో అణగిఉన్న సౌందర్యకాంక్ష, కవిత్వము, ప్రకృతి యందలి ప్రేమ, భావనాశక్తి, విశ్వప్రేమ, అన్నీ ఒక్కసారి బయటపడ్డవి. నన్నిక్కడకు మార్చినందులకు నా పైఅధికారులకు వందనము లర్పించాను.

నేను ఒక్కడినీ స్టేషనులోనే ఎప్పుడూ కాలక్షేపము చేస్తూఉండేవాడిని. మా స్టేషనుకు దగ్గరలోనే ఓవర్సీరుఆఫీసు ఉండేది. ఆ ఆఫీసుకు దగ్గరలోనే ఓవర్సీరు, దాక్షిణాత్యుడు, తనభార్యతో కాపురముండేవాడు. నే నక్కడకు వెళ్ళిన కొద్దిరోజులలోనే మా

కిద్దరికీ స్నేహాము కలిసినది. తరుచు నేను వారింటికి వెళ్ళడమో లేక ఆయన నాబసకు రావడమో జరుగుతూ ఉండేది.

ఇలాగు ఏ బెంగా లేకుండా సుమారు ఎనిమిది మాసములు గడచినది. ఇంకనుతిరుగ ఇంటికివెళ్లేరోజులు సమీపిస్తున్నవిగదా అని సంతోషిస్తూ ఉండేవాడిని. కొత్తగా వచ్చినప్పుడున్న బెంగ నిస్సారమైతుకముగదా అని నాలో నేనే నవ్వుకుంటూ ఉండేవాడిని.

నేను ప్రతిరోజూ రెండుపూటలా నా గుర్రము మీద షికారు వెడుతూ ఉండేవాడిని. మామూలుప్రకారము ఒకరోజు మధ్యాహ్నము మూడుగంటలకే బయలుదేరి షికారు వెళ్ళినాను. ఆరోజు మామూలుకంటె చాలా దూరము వెళ్ళినాను. ఆ అడవికి అదివరకు నేనెప్పుడూ వెళ్ళలేదు. నేనిదివరకు చూచిన అన్ని అడవులకంటే కూడా చాలా అందముగా ఉన్నది. గుర్రమును అక్కడ ఒకచెట్టుకు కట్టివేసి నేనొకరాతిమీద కూర్చుని ఆ సౌందర్యమును చూచి ఆనందిస్తున్నాను. అలాగే నాకు తెలియకుండానే సూర్యాస్తమయము కావచ్చినది. నేను కూర్చున్నచోటుకు దగ్గరగానే ఒకపెద్దచెరువు ఉన్నది. కొన్నిలేళ్ళువచ్చి నన్నుచూచి సందేహించి నేను నిశ్చల

ముగా కూర్చోడమువల్ల భయమువదలి నీళ్లుతాగిచక్కా పోయినాయి. చెట్లలో పక్షులుచేసే రొదతో చెవులు గింగురుమని పోతున్నాయి. కొంచెము దూరములో ఒక నెమళ్ళగుంపు పరుగెత్తుకుపోతోంది.

సూర్యుడు అస్తమించబోతున్నాడు. చెరువుకు నీళ్ళ అడుగున ఎర్రని డాకు రేకు పరచినట్లుగా ఉన్నది. మధ్యమధ్య చెట్లనీడపడి చాలా చక్కగా ఉన్నది. ఆచెరువుకేసి తదేకదీక్షగా చూస్తూఉండగా దూరాన్ని ఒకపెద్దపులి నెమ్మదిగా ఒకచెట్టుచాటునుంచివచ్చి నీళ్ళు తాగుతోంది. దాన్ని చంపుదామా అని పక్కనున్న తుపాకీపైకి చెయ్యి పోయింది. కాని ఆ సమయములో అంతఘోరకృత్యము చెయ్యబుద్ధి అయిందికాదు. చెయ్యి తుపాకిమీదనుంచి తీసివేశాను. పెద్దపులి, దానిదారిని అది పోయింది. నే నింక వెడదామని లేవబోతున్నాను. నా వెనుకనుంచి కిలకిల నవ్వు వినబడ్డది. లేచి వె నక్కు తిరిగి చూచాను. నా వెనుక ఒకచెట్టును విలాసముగా చేర్లపడి సుమారు పద్ధెనిమిది సంవత్సరముల బోయకన్య ఒకతె అజాంతాచిత్తరువులా నవ్వుతూ నిలబడ్డది. నాకు ఆశ్చర్యము వేసినది.

సుమారు అయిదడుగులున్నరఎత్తు, మెరుగుచా మనచాయ శరీరము, దట్టముగా తుమ్మెదరెక్కలవలె నల్లగాఉన్న శిరోజములు, సోగలై, విశాలములైన కన్నులు, తీరిచినట్లు కనుబొమలు, కోటేరేశినట్లు ముక్కు, ముద్దులుమూటకట్టే నోరు, తాళఫలప్రతిమానములైన స్తనములు, చూచి నిశ్చేష్టుడనై పోయాను. ఏమి అన డానికీ తోచలేదు. పోదామంటే కాళ్ళు అక్కడనే పాతుకుపోయినట్లు కదలలేదు. దృష్టి ఆమె ముఖము మీదనుంచి మరల్చుకుందామంటే నాకు సాధ్యము కా లేదు. ఒక చిన్న ముతకగుడ్డ మొలకు చుట్టపెట్టుకుంది. అంతకంటె వంటిమీద మరొకబట్ట ఏమీలేదు. నాక క్కడ నుంచోడానికి చాలా సిగ్గువేసినది. కాని కదలి పోలేకపోయాను. నే ననేకమంది బోయకన్నెలను చూ చాను. వాళ్ళలో ఎవ్వరినీ మళ్ళీ కన్నెత్తిచూడ బుద్ధి పుట్టలేదు. బొమ్మలలోనూ జీవితములోనూ అనేకమంది చక్కనిస్త్రీలను చూచినాను. ఈమెముందు వాళ్ళంతా చంద్రునిముందు నక్షత్రములవలె కనబడుతున్నారు. నాకు నలుపన్నా చామనచాయఅన్నా అట్టే ఇష్టముం డేదికాదు. చామనచాయ చాలా చక్కనిరంగు అంటే నేను ఎప్పుడూ వప్పుకునేవాడినికాను. కాని ఈపిల్ల

శరీరములో ఉన్న ముఖములోని మెత్తతనము, పట్టు లోని మెరుపూ చూచి నా అభిప్రాయము తప్పని తెలుసుకున్నాను. ఈపిల్ల నామనసును కలతపెట్టినట్టు ఎంత చక్కని స్త్రీకూడా ఇదివర కెప్పుడూ నన్ను కలతపెట్టి లేదు. ఆపిల్లకేసి అలాగే పదినిమిషములు రెప్పవాల్చకుండా, అదురుతున్న గుండెతో, చెదిరినమనసుతో, చూస్తూ నిలబడ్డాను. ఆ అమ్మాయికూడా మందహాసము నాట్యమాడుతున్న కళ్ళతో, చలిస్తున్న అధరముతో నాకేసి చూస్తూ ఒయ్యారముగా నిలబడ్డది. అంబరవీథిని విహరిస్తున్న నామనస్సును లాగిపట్టి మాట్లాడకుండా గిరుక్కున తిరిగి గుర్రమెక్కి పరుగున నా బస చేరుకున్నాను. నేను గుర్రమెక్కగానే ఫక్కున నవ్వింది ఆపిల్ల.

౪

ఆపూట నామనస్సు మనస్సులో లేదు. ఏపని చేద్దామన్నా ఏమీ తోచేదికాదు. ఆపిల్ల నవ్వు నా చెవులలో మారుమోగుతూ ఉండేది. ఆమె ముఖము నాకళ్ళముందు నాట్యమాడుతూ ఉండేది. ఆపూట అన్నము సయించలేదు. ఆరాత్రి నిదురపట్టలేదు. స్వచ్ఛమైన నామానసాకాశమున నల్లని చిరుమబ్బులు బయ

లుదేరినాయి. ఈపూరు రాజ్యోద్యమందు బయలుదే రిన బెంగ ఒక్కసారి మనసులో తళుక్కుమని మెరి సినది.

మరునాడు ఉదయాన్నే లేచి మామూలు ప్రకా రము షికారు బయలుదేరినాను. అనుకోకుండానే తిన్న గా, నిన్న వెళ్ళినచోటికే వెళ్ళినాను. నాకోసము కని పెట్టుకుని ఉన్నట్టుగా ఆబోయపిల్ల అక్కడనే ఆలాగే నవ్వుతూ నిలబడ్డది. ఆపిల్ల నక్కడ చూడడముతోనే ఒకవిధమైన సంతోషమూ భయమూ కూడా కలిగి నాయి.

గుఱ్ఱము నొకచెట్టుకు కట్టివేసి ఒకరాతిమీాద కూర్చున్నాను. ఆపిల్లే మొదట నన్ను పలుకరించినది. 'ఏమండీ దొరా' నిన్నను పారిపోయినారేమి? నన్ను చూస్తే భయమువేసినదా? పోలీసువారుకూడాను అట్లా భయపడ్డారేమి? అందులో 'ఆడపిల్లను చూచి' అన్నది.

నాకు కొంచెము సిగ్గువేసి తలవంచుకున్నాను. ముఖము ఎఱ్ఱపడ్డది. "నిన్ను చూచి నేను భయపడడ మేమిటి" అన్నాను.

"లేకపోతే ఎందుకలా పారిపోయారు నిన్నను" అన్నది.

"నేను పారిపోలేను. చీకటిపడుతున్నదికదా అని వెళ్ళిపోయినాను" అన్నాను.

'ఆలాగా? అయితే పరవాలేదు అన్నమాట. నేను దగ్గరకు రావచ్చునా' అని నాసమాధానము వినకుండానే వచ్చి నాపాదములదగ్గర కూర్చున్నది. ఒక్క అరగంటసేపు ఏమీ మాట్లాడకుండా నాముఖముకేసి తదేకదీక్షగా చూస్తూ కూర్చున్నది. నేను ఆపిలముఖము మీదనే దృష్టి నిలిపినాను. నామనస్సు ఎక్కడెక్కడికో పోయినది. ఏవేవో ఆలోచనలు బయలుదేరినాయి.

"ఇంతకాలము ఊరుకున్నారేమి, ఇక్కడకు రాకుండాను" అన్నది ఆఖరికి ఆపిల్ల. నేను ఉలిక్కిపడ్డాను. గగనసంచారముచేస్తూన్న నా ఊహాలను వెనక్కు మళ్ళించి, "ఇంతకాలము ఏమిటి, ఎంతకాలము" అన్నాను.

"ఎనగరా! మీరిక్కడకువచ్చి ఏడెనిమిది మాసములైనదే. అప్పటినుంచి నేను మీకోసము ఎదురుచూస్తున్నాను. ఒక్కసంవత్సరమునుంచి నాహృదయములో చెప్పశక్యముకాని ఆందోళన బయలుదేరినది. దానికి ఏవిధమైన శాంతిచేదామన్నా సాధ్యమైనదికాదు. నాకెప్పుడూ నిద్రపట్టేదికాదు. తిండి తినబుద్ధి అయేదికాదు.

ఎక్కడనుంచో ఏదో పిలుపు వినపడుతూ ఉండేది. దేని కోసమో నిరంతరమూ వెతుకుతూ ఉండేదాన్ని. ఎప్పుడూ ఈ అడవులలో ఈ చెట్లమధ్య తిరుగుతూ ఉండేదాన్ని. మా వాడే ఒకడు తన్ను పెళ్ళిచేసికోమని చాలా తొందరపెట్టినాడు. నాకెంతమాత్రమూ ఇష్టము లేకపోయినది. మీరు వస్తారని నాకు తెలుసును. ఏడెనిమిది మాసములనుంచి హృదయవేదన కొంచెము తగ్గినది. అప్పుడు మీరు సమీపములో ఉన్నారని తెలుసుకున్నాను. అప్పటినుంచి ఇంకా రారేమని కనిపెట్టుకుని ఉన్నాను. ఆఖరికి నిన్న మిమ్ములను చూడగానే పట్టరాని సంతోషము వచ్చినది. మండువేసంగిలో మలమల మాడిపోయిన భూమిపైన తొలకరివర్షము పడితే ఉన్నట్లుగా ఉన్నది నామనసుకు అప్పుడు. ఇంతకాలము నుంచీ నేను ఎదురు చూస్తున్నది మీకోసమేనని తెలుసుకున్నాను. నేనిక్కడ కనిపెట్టుకున్నానని మీకెప్పుడూ తోచలేదూ? అయితే మీ నాగరికులు అటువంటి సూచనలు తెలుసుకోలేరేమో? మా ఆటవికులసంగతి వేరు. ప్రతిగాలిలోనూ మాకొక వార్త ఉంటుంది. ప్రతి పక్షికిలకిలలోనూ మాకొకపాట వినిపిస్తుంది. ప్రకృతిలో ప్రతిఒక్కధ్వనికీ మాహృదయము ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. మీలో అలాకాదేమో!" అని ఊరుకున్నది.

నేను ఏమి చెప్పడమునకూ తోచినది కాదు. అమాయకురాలైన ఆపిల్లమాటలు విని, జ్యోతులవలె ప్రకాశిస్తూన్న ఆమెకన్నులు చూస్తూ, ప్రేమపూరితము, అగాధము అయిన ఆమెహృదయమును తలచుకుంటే నాకే భయము వేసినది. ఏమీ అనలేకపోయినాను. అనిర్వచనీయమైన కరుణారసము బయలుదేరి నన్ను ముంచెత్తినది. నాచెయ్యి ఆమెవైపుకు జాపినాను. ఆమె నాకరగ్రహణము చేసి, నాదగ్గరగా జరిగి నా కాళ్ళపైన తనతల ఆనించి, కన్నీటితో నాపాదములను తడిపినది.

అలాగే కదలకుండా సూర్యుడు నెత్తిపైకి వచ్చే వరకూ నోరులేనిపక్షులవలె కూర్చున్నాము. నన్నుగురించి ఆమె ఏమీ అడుగలేదు. నేనేమీ చెప్పలేదు. లేచి 'నేను వెడుతాను' అన్నాను. 'సరేను' అన్నది. మళ్ళీ ఎప్పుడు వస్తావని అడుగలేదు. ఎవరిదారిని వారు వెళ్ళినాము.

ఆసాయంకాలము మళ్ళీ అక్కడనే కలుసుకున్నాము. మా ఉభయులమైత్రి ఎట్లు అభివృద్ధి పొందినదీ ఇప్పుడు నేను చెప్పలేను. అదంతా తలుచుకుంటే నాకు చాలాబాధగా ఉన్నది. అందుచేత నన్ను క్షమించండి. కాని ఒక్కసంగతి: ఆ అమ్మాయి ఆరోజులలో అన్న

మాటలూ, చేసినచేష్టలూ, చూచినచూపులూ జన్మ జన్మాంతరములకూ మరుపురావు. అహర్నిశాదులు దుస్స్వప్నములవలె ఎప్పుడూ నాకళ్ళకు కట్టినట్లుండి యమబాధ పెడుతున్నాయి. అన్నివిధములా నరకము అనుభవిస్తున్నాను

కొన్నిరోజు లలా సుఖస్వప్నమువలె గడచిపోయినాయి. ఒకరోజురాత్రి భోజనము చేసి పండువెన్నెలలో కుర్చీవేసుకుని కూర్చున్నాను. ఊహాప్రపంచములో సంచరిస్తూ పరధ్యానముగా కూర్చున్నాను. సుమారు రెండు ఝామువలరాత్రి అవుతుంది. ప్రపంచమంతా నిశ్శబ్దముగా ఉన్నది. దూరాన్ని ఎక్కడో పులి అరుపు వినపడ్డది. ఎక్కడనో ఒకకీచురాయి శబ్దముచేస్తూ ఉన్నది. నాకు కొంచెము దూరములో నానౌకరు గుర్రుపట్టి నిద్రపోతున్నాడు. హఠాత్తుగా నావెనుకనుంచి ఎవరో వచ్చి నాకళ్లు మూశారు. ఉలిక్కిపడి చేతులుపట్టి చూచి బోయపిల్ల అని తెలుసుకున్నాను. నెమ్మదిగా నవ్వుతూ నాకుర్చీచేతిమీద కూర్చున్నది. ప్రతిరోజూ తనుఅక్కడనే నిద్రపోతున్నాను. అని చెప్పింది.

* * * * *

తెల్లవారకముందు లేచి వెళ్ళిపోయింది.

౫

ఇలాగు మూడుమాసములు గడచినవి. నాకు ఇక్కడ ఉద్యోగము ఆఖరు కావస్తున్నది. ఇంకొక నెల దినములలో ఇంటికి పోవచ్చునుకదా అనుకున్నాను. ఈపిల్లతోటి ఎలా చెప్పడము, ఎలావదలించుకోవడ మను కుంటూ ఆలోచిస్తూ, ఒకరోజు రాత్రి మావసారాలో పచారు చేస్తున్నాను. బయట గాఢాంధకారముగా ఉన్న ది. అప్పటికి సుమారు పదకొండుగంట లవుతుంది. నా వెనుక మెల్లగా వస్తున్న అడుగులచప్పుడు వినపడ్డది! నేను వెనక్కు తిరిగి చూచేటప్పటి కప్పుడే ఆవ్యక్తి నా దగ్గరకు వచ్చినది.

పరీక్షగా చూచేసరికి ఆమె నా స్నేహితుడైన ఒవర్సీరుభార్య. ఆరోజున ఆయన ఊళ్ళో లేడని నాకు తెలుసును. ఎందుకు వచ్చినదా అనుకున్నాను. ఉత్తర క్షణమందే నాసందేహము తీరినది. "ఏమి, అలాచూస్తా రు? ఇట్లావచ్చినానని నాపైన కోపమా" అంటూ నెమ్మ దిగా దగ్గరకు చేరినది.

నేను ఆవూరు వచ్చినప్పటినుంచీ ఆమె నాయెడ లచూపిన ఆదరమువల్లా, భర్త చాటునుంచో లేక నేను ఒంటరిగా కనుపించినప్పుడో ఆమె చూపిన హావభావ

విలాసాదులవల్లా ఆమె నన్ను వేరుచూపుతో చూస్తూన్నదని తెలుసుకున్నాను. నాకు చిన్నప్పటినుంచీ ఇటువంటి అనుభవములు చాలా అయినవంటే మీరు అతిశయోక్తి అనుకుంటారేమోనని సందేహిస్తున్నాను. కాని ఈఒక్క బోయకన్య విషయములోతప్ప నేనెక్కడా ఎవ్వరికీ లొంగలేదంటే మీరు నమ్మవలెను. అటువంటి అప్పుడు ఈమె-నాస్నేహితునిభార్య-ఇలా సాహసించడముతోనే నాకు చాలా ఆశ్చర్యము కలిగినది. ఆమె ననేకవిధాల మందలించి పంపవలెనని ప్రయత్నముచేసినాను. నేను వద్దన్న కొద్దీ ఆమెదగ్గరకు వచ్చి నన్ను ఆలింగనము చేసుకోపోయినది.

ఆసమయములో వికటమైన ఒక పెద్దనవ్వుమాకు వినపడ్డది. దానితో ఆమె హడిలిపోయి మళ్ళీతిరిగిచూడకుండా వాళ్ళ బసకు పోయినది. ఆనవ్వు ఎక్కడనుంచి వచ్చినదో నాకు తెలుసును. నేను నిశ్చలముగా నిలబడ్డాను. నిప్పులు కక్కుతున్న కళ్ళతో పొంచిఉన్న పులి నెమ్మదిగా ఎరదగ్గరకు వచ్చినట్లు ఆబోయపిల్ల నాదగ్గరకు వచ్చి "ఎవరామనిషి" అన్నది. ఎవరైతే నీకెందుకు అన్నాను.

"నాకు కాకపోతే ఇంకెవరికి? ఎందుకు ఆవిడను కౌగిలించుకున్నావు" అన్నది.

'నేను కౌగిలించుకోలేదు. ఇంతకీ, నేను కౌగిలించుకుంటేమట్టుకు నువ్వెవరు అడగడానికి? నీకేమైనా బొందికట్టినానా" అన్నాను కోపముగాను.

దానితో కొంచెముతగ్గి "నువ్వూ ఇలాటివాడవేనా? నీవు వేరనుకున్నాను. నేనిది సహించలేను" అన్నది. "మరి అయితే నేను వెళ్ళినతరువాత ఏమిచేస్తావు" అన్నాను.

ఛంగునలేచి, "ఏమిటీ? వెళ్లిపోతావా ? నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతావా ? నాగతేమిటి ? నువ్వు మామూలుమనిషివి కావనుకున్నాను. అందరిలాటివాడవే నీవూను. దొరకినవరకూ పుచ్చుకోవడమూ, ప్రతిఫలము కోరినప్పుడు మాట్లాడకపోవడమూను. చెరకునురసమున్నంతవరకు పీల్చి పిప్పిచేయడమూను, పారవేసి పోవడమూను. నన్నింతమోసము చేస్తావనుకోలేదు." అని విలపించడము ప్రారంభించినది.

నాకు బాగా కోపము వచ్చినది. "ఏమిటి ఈ అల్లరంతాను? వెళ్లిపోక ఇక్కడ నీకు పాదసేవ చేస్తూ

కూర్చొంటా ననుకున్నావా ఏమిటి? నాకేమీ ఇల్లూ వాకలీ, పెళ్ళామూ లేదనుకున్నావా" అన్నాను.

"ఏమిటీ! నీకు భార్యకూడా ఉన్నదా? అయితే వెళ్ళడము నిశ్చయమే. అయ్యో, నాతోటి మొదటనే ఎందుకు చెప్పలేదు. నీచక్కనిముఖము చూచి నీ హృదయముకూడా అంత శుభ్రమైన దనుకున్నాను" అని ఇంకా ఏమేమో నన్ను నిందిస్తూ నాపాదముల దగ్గర పడి చాలాసేపు ఏడిచినది.

నేనేమిచేయను? నాకు మనస్సులో చాలాకష్టముగానే ఉన్నది. నేను ఆపిల్లను మోసముచేయవలెననుకోలేదు. కాని నాసంగతి చెప్పవలసినదే మొదట. అది నాతప్పే. అప్పుడు నేను నేనుగా లేను. నాకు ఏమీ స్వతంత్రము లేకపోయినది. మహాప్రవాహములో కొట్టుకుపోతున్న నావలాగ అశక్తుడనై ఊరకున్నాను. శ్రుతిమించిన తరువాత, తప్పుకోవడ మెలాగనే అహర్నిశాదులు ఆలోచిస్తున్నాను.

ఇప్పుడీపిల్లను ఎలా ఊరుకోపెట్టడానికీ తోచలేదు. మాట్లాడకుండా అలాగే నిలబడ్డాను. కొంతసేపు ఏడ్చిఏడ్చి, తుదకు లేచి నా రెండుచేతులూ పట్టుకుని, 'అయితే నిజముగా వెడతావా' అన్నది. ఆమెముఖము

చూస్తే నాకూ కళ్ళమ్మట నీళ్ళువచ్చినాయి. 'వెళ్ళక ఏమిచెయ్యను. ఇంతకూ ఇంకొక నెలరోజులు పోయిన పిమ్మటకదా' అన్నాను.

కన్నుల నిప్పులు కురుస్తూ ఉరుము ఉరిమినట్లు 'అవును పాపము, ఇంకొక నెల ఇక్కడ ఉండాలి కాబోలు. తరువాత సుఖముగా భార్యకౌగిట్లో స్వర్గము అనుభవించవచ్చును. నేనేమైతే నీకేమి. ఎక్కడినుంచో మా అడవులలోనికి వచ్చావు. మా ఉద్యానవనాలలో దొరకని దివ్యకుసుమము ఒకటి కనుపడితే అది కోసుకున్నావు. కాస్సేపు ఆ సౌరభము అనుభవించావు ఇంకా అది నలగనేనా నలగకుండా, వాడనేనా వాడకుండా నేలమీంద గిరవాటేశి పోతున్నావు. నీకేమి, ఇంకొక పువ్వు దొరుకుతుంది. నలిగిపోయేదీ వాడిపోయేదీ పువ్వుకాని నీవుకాదుకా. నువ్వెప్పుడూ మందహాసము చేస్తూ ఏమీ ఎరుగనట్లు వాయువులాగ నీ ఇష్టము వచ్చినచోట సంచరించవచ్చును' అని గర్భనిర్భేదముగా ఒకనవ్వు నవ్వినది.

ఒక్కక్షణము ఊరుకుని, 'నువ్వు పాపము సుఖపడదామని సంతోషిస్తున్నావేమో. నీకింక సుఖమన్న మాట లేకుండా చేస్తాను. నాకెలాగూ లేదు. నీవుమట్టు

కెందుకు సుఖపడాలి? నిన్నిక్కడనుంచి సుఖముగా వెళ్ళ నివ్వను. నాకు నువ్వు దక్కకపోయినాసరే కాని ఇత రుల కౌగిట్లో నిన్ను చూచి సహించ లేను. ఆ ఆలోచన కూడా సహించ శక్యము కాదు. మా సంగతి నీకు తెలి యదు. మే మెంత ప్రేమించగలమో అంతకంతా అస హ్యించుకోగలము. అమృతము పుట్టినచోటనే విషము కూడా పుట్టినది. ఇంతగా నన్ను ప్రేమించిన మనిషి నా కపకారము చేస్తుందా అనుకుంటావేమో. అటువంటిభ్ర మలు పెట్టుకోకు' అని ఒక్కపరుగున చక్కాపోయినది.

నాకు ఎక్కడలేని భయమూ వేసినది. కాళ్ళు వణకడ మారంభించినవి. అక్కడనే చదికిలపడి, తెల్ల వారువరకూ పొడిగుడ్లతో కూర్చున్నాను.

౬

ఇంక నాకథ ఆఖరు కావస్తున్నది, క్షమించండి ఇంతసేపు మిమ్ములను కూర్చో పెట్టినందుకు. ఉదయా న్నే బయలుదేరి ఆపిల్లను కలుసుకుని కొంచెము సను దాయిద్దామని మామూలుచోటికి వెళ్లినాను. అక్కడ కనపడలేదు. తిన్నగా ఇంటికి వచ్చి భోజనముచేసి పడు కున్నాను. సాయంకాలముకూడా ఆపిల్ల కనపడలేదు. 'ఏమి భగవంతుడా, ఇదేమి చేస్తుందా' అనుభీతితో

మళ్లీ భోజనముచేసి పడుకున్నాను. తెల్లవారుసరికి ఉప ద్రవమైన తలనొప్పితో లేచాను. కళ్లు తెరిచేసరికి నా శరీరము నాకే అసహ్యాముగా కనుపించినది. అద్దము దగ్గరకువెళ్లి చూచుకున్నాను. మీాకిప్పుడు కనుపడ్డస్థితి లో నాశరీరము నాకు కనుపించినది. ఆకాశము విరిగి నెత్తిని పడ్డట్టయినది. స్పృహతప్పి పడిపోయినాను. కొం తసేపటికి తెలివి వచ్చినది. కర్ణకఠోరమైనవవ్వు దూరా న వినపడ్డది. ఆమనిషిని చంపుదామని తుపాకితీసుకుని పరుగెత్తాను. ఎక్కడా దొరకలేదు. ఇంక చేయువలసిన దేమున్నది ? ఒక్కవిషపుగాలి వచ్చి ఫలోన్ముఖమైన చెట్టును మాడ్చేశినది.

తత్క్షణము ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి రెండ వకంట కడకుండా మాఅత్తవారింటికి చేరుకున్నాను. ఎవ్వరూ నన్ను ఆనవాలు పట్టలేక పోయారు. మా మామగారితో జరిగినదంతా చెప్పాను. నిశ్చేష్టుడై విన్నాడు. చాలాసేపు విచారించాడు. నాఆస్తి నాభా ర్యపేర వ్రాయించాడు. నన్ను ఎక్కడికేనా వెళ్లి మంమపుచ్చుకోమన్నాడు.

'నే నీస్థితిలో ఎక్కడికి వెడతాను ? మా అమ్మ కూడా లేదాయెను. ఇక్కడనే ఉండి మందు పుచ్చు కుంటా' నన్నాను.

'పిల్ల లున్న ఇల్లు, ఇక్కడెలా వీలవుతుంది. నీశరీరము వరుసచూస్తే కుష్ఠువ్యాధిలా ఉన్నది. ఇక్కడ ఆట్టే వీలుగా ఉండ'దన్నాడు.

'అయితే నాభార్యను పంపండి. మేము వేరే ఉంటాము' అన్నాను.

'అమాయకుడులా ఉన్నావు. అదిమట్టుకు ఒక్కత్తె ఉండి నీకు ఏమిసంరక్షణ చెయ్యగలదు ఇది ఘోరమైన అంటువ్యాధి అన్నసంగతి నీకుమట్టుకు తెలియదా. దాన్ని ఎందుకు బాధపెడతావు. పైగా ఈ అల్లరంతా నలుగురునోళ్లా పడడము ఎందుకు. ఎక్కడికో వెళ్లి చడీచప్పుడూ కాకుండా మందు పుచ్చుకురా' అన్నాడు.

నాభార్యను పిలిచి 'నీఅభిప్రాయమేమి' టన్నాను. మాట్లాడకుండా ఏడుస్తూ నిలబడ్డది. కొంతసేపటికి 'ఏ రామచంద్రపురం ఆసుపత్రిలోనో మందు పుచ్చుకుంటే వీలుపడదా' అన్నది.

"నేనింక మారుమాటాడకుండా చక్కా వచ్చాను. ఒకరిద్దరు వైద్యుల నడుగుతే ఇదేవ్యాధో అసలు తెలుసుకోలేక పోయారు. పైకి ఇలాఉన్నా లోపల మామూలుగా బలముగానే ఉన్నది. చేసేది ఏమీ లేక

వంటికి తిరిగీ వెళ్ళడము ఇష్టము లేక భిక్షాటన ఆరంభించాను. ఈ ఒక్కపొట్టకు తిండిదొరకడమే కష్టముగా ఉన్నది. ఏమిచెయ్యను? నే చేసుకున్న పాపము. జన్మాంతర సంబంధమై ఉండవలెను. ఎంతెంతమందో ఎన్నో ఘోరకృత్యములు చేసి సుఖముగా ఉంటారే, నాకర్మము మట్టుకు ఇలా ఎందుకు కాలవలెను?"

౨

చాలాసేపు ఆభిక్షువు ఆలా విచారిస్తూ కూర్చున్నాడు. నాకూ జాలివేసి నేనూ కాస్సేపు విచారించాను. 'అయ్యా. విచారించకండి. నిప్పుతో చెలగాటాలాడేటప్పుడు ఒక్కొక్కప్పుడు ఒళ్లుకాలడము సహజమేను. కాని మీరు అధైర్యపడకండి. ఇటువంటి భయంకరమైన వనస్పతులు ఉన్నవని విన్నాను. మీరు చెప్పినది దానికి దృష్టాంతరముగా ఉన్నది. దీనికి విరుగుడు కూడా ఉన్నదని వైద్యులు చెపుతారు. ఎంతత్వరలో వచ్చినదో అంతత్వరలోనూ మళ్లీ నివారణ అవుతుంది. కాబట్టిమీరు మళ్లీ ఒక్కసారి మన్యము వెళ్లి ఏకోయ వాళ్లనేనా ఆశ్రయిస్తే లాభిస్తుం'దని సలహా ఇచ్చాను.

ఆమాటలు విని బ్రహ్మానందభరితుడై నాకు నమస్కారముచేసి, నేనిచ్చిన రూపాయి తీసుకుని వ్యాధి అప్పుడే కుదిరినట్లుగానే సంతోషించి వెళ్లిపోయాడు.

మంచుతెర తొలగిపోయింది. సూర్యుడు చక్కగా ఉదయించాడు. రైలుస్టేషనుదగ్గర మళ్లీ రైలుకు గంటకొట్టారు. ఈరైలేనా తప్పకూడదని నెమ్మదిగా స్టేషనుకు వెళ్లాను.